# శ్రీవాణి ప్రాంగణంలో

# శ్రీ జి.వి.జి. సన్మాన సంరంభం




ఆరోజు శనివారం మే 2వ తేదీ. సాయంత్రం ఆరు గంటల సమయం. శ్రీవాణి కార్యాలయ ప్రాంగణం పురప్రముఖులతో, పండితులతో, ప్రభుత్వ అధికారులతో చాలా సందడిగా ఉన్నది. రంగురంగుల పతాకాలతో, స్వాగత తోరణాలతో కళకళలాడుతోంది. ఆరున్నర అవుతుండగా భారత ప్రభుత్వ ఎన్నికల కమీషనర్ శ్రీ జి.వి.జి. కృష్ణమూర్తి, తన శ్రీమతిగారితో అక్కడికి విచ్చేశారు. శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు, శ్రీవాణి మేనేజర్ శ్రీ కొమరగిరి చంద్రశేఖర్ ప్రభృతులు స్వాగతం పలుకగా, వారికి శ్రీ హనుమంతాచార్యులుగారు తదితరులు వేద మంత్రోచ్చారణలతో పూర్ణకుంభంతో ఆహ్వానం పలికారు. ఆనాటి శ్రీవాణి కార్యక్రమానికి శ్రీ జి.వి.జి. ముఖ్యఅతిధి, ఆదిశంకరాచార్య జన్మదిన సంచికకు ఆవిష్కర్త. సభా ప్రాంగణంలోకి ముఖ్యఅతిధి అడుగిడగానే ఆహూతులందరు గౌరవ సూచకంగా లేచి నిలబడి వారికి స్వాగతం పలికారు.

ఆపై కార్యక్రమం ఆరంభం అయింది. అందంగా, శోభాయమానంగా, నయనానందంగా అలంకరించబడిన వేదికపై శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి, ముఖ్యఅతిధి శ్రీ జి.వి.జి. కృష్ణమూర్తి, వారి సతీమణి శ్రీమతి పద్మ, బందరు శాసన సభ్యులు శ్రీ అంబటి బ్రాహ్మణయ్య, కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు ఆశీనులయ్యారు. అమలేశ్వరీ విద్యాసంస్థల అధినేత శ్రీ బి. హనుమంతరావు వారిని వేదిక పైకి ఆహ్వానించారు. అంతేకాదు, శ్రీమతి యన్. వరలక్ష్మి, శ్రీమతి సుమేధ, శ్రీమతి రాజేశ్వరీ అశ్వినీకుమార్‌లు వారికి

(తరువాయి 22వ పేజీలో)

జూన్ 1998
సంపుటి 14 సంచిక 6

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of
*"SREEVANI"* Monthly
Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

Despatched on
**8- 6 -1998**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం :
**పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంతస్వామి ప్రభుపాదులు**

# అమృతవాణి

త్వదీయ దానేన పరిగ్రహీతుః
న చింతితవ్యం భవతీతి లాభః
పరంతు పాపక్షతయే తవైవ
ప్రదీయతే మిత్ర న సంశయోఽత్ర

- *శ్రీ గణపతి సచ్చిదానంద*

నీవు చేసే దానంవల్ల తీసుకొనే వ్యక్తికి లాభం కలుగుతుందని అనుకోవద్దు. నీ పాపాలను పోగొట్టుకోటానికే దానం చేస్తున్నావు సందేహం లేదు.

లోకంలో దానం చేసే వాళ్ళకు చాలామందికి ఒక అభిప్రాయం ఏమిటంటే అవతలి వాడికి ఏమీ లేక మనం ఇచ్చేది తీసుకోటానికి వచ్చాడనీ, మనం యిచ్చిన దానివల్ల అతనికి లాభం కలుగుతోందనీ అభిప్రాయం.

కర్మకాండనాచరించేటప్పుడు కూడా దశదానాలనీ, షోడశదానాలనీ నిర్వహిస్తారు. ఈ దానాల వల్ల యజమానికి పాపక్షయం అవటమే కాక పరమేశ్వరానుగ్రహం కూడా కలగటం దాని ఫలంగా శాస్త్రం చెపుతున్నది. ఈ దానాలు తీసుకొన్నవారు పాపాలను కూడా మీరిచ్చిన వస్తువులతో తీసికొని వెళ్ళుతున్నారనేది గ్రహించాలి. అయితే దానం తీసుకొనే వాళ్ళనుద్ధరిస్తున్నట్లనుకొంటే అజ్ఞానమే. అందులో మీకే లాభం యెక్కువ ఉంది. మీ పాపక్షయం ఆయన చేసినందుకు కృతజ్ఞులుకండి.

ఈ రహస్యం తెలీక ప్రతిగ్రహీతలను హీనంగా చూడటం జరుగుతోంది. దానం చేయటం దైవసంపదగా గీత బోధిస్తోంది.

ఇక లౌకికంగా ఆలోచిద్దాం. తెల్లవారితే ఎంతో మంది బిచ్చగాళ్ళు మీ యింటి ముందుకొచ్చి 'భిక్షాందేహి' అంటూ యాచిస్తారు. నిజానికి వాళ్ళంతా బీదవాళ్ళే. వాళ్ళందరినీ నీవు పెట్టే గుప్పెడు బియ్యంతో పోషిస్తున్నానని అనుకొంటే పొరపాటే. కొంచెం సూక్ష్మంగా ఆలోచిస్తే వాళ్ళు మీ యింటి ముందుకు వచ్చి యాచించటం లేదు. నీ క్షేమం కోరి ఉపదేశం చేస్తున్నారనేది తెలుసుకో అని స్వామీజీ యీ శ్లోకం చెప్పి వివరించారు. ఏమిటంటే

శ్లో॥ ద్వారం ద్వారమటన్ భిక్షుః
శిక్షతేనతుయాచతే
అదత్వామాదృశోమాభూః
దత్వాత్వం త్వాదృశోభవ

ప్రతిద్వారం తిరుగుతూ బిచ్చగాడు యాచిస్తున్నాడనుకుంటున్నావేమో, కాదు అతను యాచించటం లేదు. "అయ్యా, ఏమీ దానం చేయకుండా, నా మాదిరిగా కాకండి. దానం చేసి మీరు మీలాగానే ఉండండి అని హెచ్చరిస్తున్నాడు, బోధిస్తున్నాడు అని తెలుసుకొని మసలుకోండి " అన్నారు స్వామీజీ.

మనం ఇస్తున్నాం పాపం! వాడు తీసుకొంటున్నాడు అని అనుకోవటం అహంకార లక్షణం.

ఇతరుల కీయటం నా ధర్మంగా భావిస్తున్నా అనుకోటం దైవ సంపద కలిగిన వాని సాత్త్విక లక్షణం.

- కూచిభట్ల చంద్రశేఖర శర్మ

## ప్రవాసాంధ్రులకు మనవి

**శ్రీవాణికి ప్రవాసాంధ్రులనుంచి లభిస్తున్న ఆదరాభిమానాలు ఎంతో ఆనందాన్ని కల్గిస్తున్నాయి. ఉత్తమ సాహిత్యాన్ని భావితరాలకు అందించడంలో మేము చేస్తున్న కృషికి మీరు అందిస్తున్న ఉత్సాహ ప్రోత్సాహాలకు మేము సర్వదా కృతజ్ఞులము.**

**నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక విలువలను పెంపొందింపచేస్తున్న ఈ మాస పత్రికకు మీతోపాటు మరికొందరిని చందాదారులుగా చేర్చి శ్రీవాణి పురోభివృద్ధిలో మీవంతు భూమికను నిర్వహిస్తారని ఆశిస్తూ....**

- సంపాదకులు

## అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

# పూజ్యశ్రీ ఏ.సి. భక్తి వేదాంతస్వామి ప్రభుపాదులు

శ్రీ రామకృష్ణ పరమహంస తన శిష్యుడు వివేకానందునితో పాశ్చాత్య దేశములకేగి భారతీయ ఆధ్యాత్మిక చింతన వ్యాప్తి చేయుమని ఆదేశించిన రీతిగ శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతి ఆదేశానుసారము శ్రీల ప్రభుపాదులు తన 69వ జన్మదినం కొద్ది రోజులకు రాబోవుచున్న దనగా 1965 ఆగష్టు 13న కలకత్తానుండి అమెరికాకు "జలదూత" అనే చిన్న సరుకు రవాణా ఓడలో ఏకైక ప్రయాణికుడుగా పయనించాడు.

మహా విద్వాంసుడు, యోగి, పరమభక్తుడు అయిన శ్రీల భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులు గురువు వద్ద దీక్షా స్వీకారమునకు పూర్వము ఒక మంచి గృహస్థు. ఒక కుమారుడు అతని సంతానము. కాషాయాంబర ధారియై సన్న్యాసియై, అమెరికాకు తాను వెళ్ళవలయు ననెడి సంకల్పము వెల్లడించగనే సింధియా స్టీంషిప్ కంపెనీ వారు తమ సరుకు రవాణాలో ఉచితంగా ప్రయాణానికి అనుమతించటం జరిగింది. ఆయన వద్ద కేవలం రు. 40/-లు, తాను ఆంగ్లంలో శ్రీమద్భాగవతం అనువదించిన కొన్ని సంపుటాలుగల కొన్ని పెట్టెలు మాత్రమే ఉన్నాయి. ప్రయాణంలో రెండుసార్లు గుండెపోటు వచ్చినా కృష్ణ భగవానుని అనుగ్రహం వలన కోలుకున్నారు.

37 రోజులు ప్రయాణం చేసిన "జలదూత" నౌక న్యూయార్క్ ఓడరేవు చేరింది. అమెరికాలో ఎవ్వరినీ శ్రీల ప్రభుపాదులు ఎరుగరు. శ్రీల ప్రభుపాదులువారు ఓడ దిగగానే వంగభాషలో ఒక పద్యంలో శ్రీ కృష్ణభగవానుని యందు తనకు గల అచంచల విశ్వాసాన్ని ప్రకటించి, పాశ్చాత్య జగత్తులో కృష్ణచైతన్య సందేశాన్ని వ్యాపింప చేయవలసినదని తన ఆధ్యాత్మిక గురువు పూజ్యశ్రీ భక్తి సిద్ధాంత సరస్వతీ స్వామివారు తనకిచ్చిన ఆదేశాన్ని ఒక్కమారు స్మరించారు. ఇలా ప్రార్థించారు.

"ప్రభూ! కృష్ణా! ఈ పాశ్చాత్యులు కృష్ణ చైతన్య సందేశాన్ని అర్థం చేసుకోగలిగేట్టు నేను ఎలా చేయగలను? నేను ఇందుకు దురదృష్టవంతుణ్ణి, అనర్హుణ్ణి, పతితుణ్ణి. అందుకనే అనుగ్రహం అర్థిస్తున్నాను. నీ కృప లేకుండగ నేను స్వయంగ ఈ ఆధ్యాత్మిక యజ్ఞం వీరికి అందచేయ లేను. ఈ జ్ఞానం వలన వీరి హృదయాలు వికసించి ఐహిక బంధనాలనుంచి విముక్తులు కాగలరనడంలో నాకు ఎలాంటి సందేహమూ లేదు". స్వామి వివేకానందుడు తన బృహత్తర జ్ఞానయజ్ఞ ఆరంభ సమయంలో కన్యాకుమారి అగ్రం వద్ద సముద్ర మధ్యంలో ఒక శిలపై కూర్చుండి చేసిన ప్రార్థనను తలపునకు తెచ్చెడిదిగా ఉన్నది. మహాత్ముల భావనా శైలి ఒకే విధమున నడచునన్నది సూక్తి కదా!

### డా॥ రాపర్ల జనార్ధనరావు

### సిద్ధాంతం - సాంప్రదాయం :

"హరేర్నామైవ నామైవ నామైవ మమ జీవనం, కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యధా". కలియుగమందు హరేర్నామ స్మరణకు మించిన వేరొక ఉపాయం లేదని పురాణములందు తెలుపబడినది. ఈ హరి నామ సంకీర్తనయే తరుణోపాయమని 500 సంవత్సరముల క్రితం పశ్చిమబెంగాల్‌లోని మాయాపూర్‌లో జన్మించిన శ్రీ చైతన్య మహాప్రభు సంకీర్తనోద్యమాన్ని, భక్తి ఉద్యమాన్ని ప్రారంభించి ఆధ్యాత్మిక చరిత్రలో ఒక ప్రత్యేక స్థానమును బడసి యున్నారు. మృదంగము, కరతాళములు చేతబూని మధుర స్వరమున ముక్త కంఠముతో "హరేకృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే, హరేరామ హరేరామ రామరామ

స్థాపితం:1964
శ్రీ
నగలు
22C.T. బంగారు,
కవరింగ్
చేయబడినవి.
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్సు®
P.B.No.135 శ్రీమహల్, మచిలీపట్నం-2.

హరేహరే॥ అనెడి శ్రీకృష్ణ నామ స్మరణతో శిష్య బృందముతో దేశ సంచారము చేసి శ్రీకృష్ణ నామ సంకీర్తనము బహుళ వ్యాప్తి గావించియున్నారు.

శ్రీకృష్ణుని వలె రెండు నిలువు గీతలు కల్గిన తిలకధారణ, కృష్ణప్రీతికరమైన హరిచందనము, కరిణకా మూలములు వద్ద (కణతలు వద్ద. ఇది మధ్వాచార్యులు సంప్రదాయబద్ధము చేసియున్నారు. నేటికి మధ్వులు ఈ రకమైన చందన విధిచే శ్రీకృష్ణుని యెడల తమకు గల భక్తిని వెల్లడింతురు) ధరించి భక్తి పారవశ్యమున, నృత్యమునల్పుచు (పాదములు తాళయుక్తముగ కదుపుచు) హరి నామ సంకీర్తనము చేయుచూ చైతన్య ప్రభు శిష్య బృందము. నేటికినీ తమ సంప్రదాయమును భక్తి సిద్ధాంతమును ప్రకటించుచున్నారు. శ్రీ కృష్ణచైతన్య, నిత్యానందుడు మొదలైనవారు తమ స్థిర నివాసము పూరి జగన్నాధుని ఆలయము వద్ద కొంతకాలము ఏర్పరచుకున్నారు. పూర్వాశ్రమమున శ్రీ కృష్ణచైతన్యుని నామము గౌరాంగుడు, చైతన్య మహాప్రభు స్థాపించిన మఠములను గౌడీయ మఠములని వ్యవహరింపబడుచున్నవి. శ్రీ కృష్ణ చైతన్యుడు సంకీర్తనతో గోదావరి వరకు వచ్చి కొవ్వూరులో గౌడీయ మఠము స్థాపించియున్నారు. కొవ్వూరు లోని గౌడీయ మఠములో నేటికిని శ్రీ కృష్ణచైతన్యప్రభు వదలి వెళ్ళిన పాదుకల స్థానమున, జ్ఞాపకార్థమై సిమెంటుతో పాదుకలు నిర్మింపబడియున్నవి. ఈ పాదుకా చిహ్నాములకు నేను మ్రొక్కి వచ్చినాను. శ్రీ కృష్ణ చైతన్యుల గౌడీయ మఠమునకు చెందిన అనుయాయులలో ఒకరే శ్రీల ప్రభుపాదుల గురువు శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతి. గృహస్థు అయిన వానిని దీక్షాస్వీకారములు గావించి భక్తి వేదాంత ప్రభుపాదస్వామి నామకరణమొసగి విదేశములందు శ్రీ కృష్ణచైతన్య హరేర్నామ సంకీర్తన విధానమును వ్యాప్తి గావించుమని పంపియున్నారు.

## శ్రీల భక్తి వేదాంత ప్రభుపాదుల జీవిత విశేషములు

మహాభక్తునికి ఉండవలసిన రూప విశేషము, అవధులు లేని సంస్కృత, ఆంగ్ల పాండిత్యము, మధుర గంభీర కంఠస్వరము, సడలింపులు ఎరుగని జీవన నియమములు, పరిపక్వమైన వయస్సు, (69వ సంవత్సరమున దీక్ష పొందినారు), అన్నిటికన్న మిన్నయగు గురు భక్తి శ్రీల ప్రభుపాదులు పాశ్చాత్య దేశములందు భక్తి ప్రచారము చేయుటకు అన్ని విధముల అర్హత పొంది యున్న స్వామి. ఆనాటికే శ్రీమద్భాగవతము ఆంగ్లమున తర్జుమా చేసిన గ్రంథములు పెట్టెలలో "జలదూత" నౌకలో వెంట తీసుకొని వెళ్ళినారు కదా!

1965 నుండి 1977 వరకు శ్రీల ప్రభుపాదులు ప్రపంచంలోని ప్రతి ప్రముఖ నగరంలోను "హరేకృష్ణ" మందిరములు స్థాపించి ఎంతో ఆశ్చర్యముగ వేనకు వేలు శ్వేతజాతి వారిని కృష్ణ భక్తి యెడల మనసులు మార్చి కృష్ణభక్తులుగా మార్చి వారెల్లరు శ్రీ కృష్ణ చైతన్య ప్రభు సిద్ధాంతములు అనుసరించునటుల చేసి, వారి భౌతిక లాలసత కల్గిన జీవితములకు నూత్న రూపములొసగి వారిని ధన్యులను గావించియున్నారు. ఏజాతి వారైనను, ఏ మతము వారైనను శ్రీకృష్ణ భక్తికి అందరూ అర్హులే. కావలసినది అకుంఠిత భక్తి జీవనము అని బోధించి అందుకు అంగీకరించిన వారికి భక్తి దీక్ష ఒసగి వేలాది హరేకృష్ణ భక్తులను వృద్ధి గావించియున్నారు. వారు పాశ్చాత్యులని, జీవన నియమ విధానమందు ఏ విధమైన

సడలింపులు లేక అట్టివారినే భక్త బృందమున చేర్చుకొనుట విశేషము. వీరు స్థాపించిన సంస్థకు "International Society for Krishna Consciousness ( ISKCON) 'ఇస్కాన్' అను స్వల్ప ఉచ్చారణగల శబ్దముతో అనేక పాశ్చాత్య నగరములలో పారిస్, ఫ్రాంక్‌ఫర్టు, జెనీవా, న్యూయార్కు, శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్ ఆంజలిస్, లండన్ మొదలైన నగరాలలో 'ఇస్కాన్' హరేకృష్ణ మందిరాలు ప్రతిష్ఠించి అందమైన పాలరాతితో చేయబడిన రాధా కృష్ణ విగ్రహములు, పూరిలోని జగన్నాథ స్వామి విగ్రహముల నమూనాలు, శ్రీ కృష్ణ, బలరామ, సుభద్రల విగ్రహములు నెలకొల్పి అనుదినము శిఖలు ధరించి, యజ్ఞోపవీతములు, తులసిమాలలు, జపమాలలు ధరించి, భారతీయ .భక్తి గీతములు పాడుట నేర్పించుట వీరి ఘనతకు తార్కాణము.

## పిట్స్‌బర్గ్‌లోని ప్రధాన కేంద్రం :

పిట్స్‌బర్గులోని శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంలోను, అయ్యప్పగుడి వద్ద, పగలు కాలక్షేపం చేసి, పిట్స్‌బర్గులోనే గల హరేకృష్ణ మందిరానికి రాత్రి 8 గంటలకు కోడలు, కొడుకు, మనుమలు శ్రీమతితో అబ్బాయి డ్రైవ్ చేస్తూ ఆ కొండచరియల్లోంచి ఎగుడు దిగుడు రోడ్డులో గుండెదడతో హరేకృష్ణ మందిరము చేరాము. అచటి భారతీయ కళా విశేషము అద్భుతం. శ్వేత స్త్రీలు చీరెలు, కృష్ణ తిలకం తులసిమాలలు ధరించి మృదంగ కరతాళధ్వనులతో శ్రీ కృష్ణనామ సంకీర్తనం చేస్తూ మీరాబాయి వలె కన్పించిన ఆ శ్వేతజాతి స్త్రీలను అచటి శిష్యులు కాషాయం ధరించి భజన చేయటం చివరకు సాత్త్వికమైన ప్రసాదం అందరికీ ఇవ్వటం నేను పిట్స్‌బర్గ్‌లో పొందిన అనుభూతి ఫొటోలలో భద్రపరచుకున్నాను.

## హరేకృష్ణ భక్తుల నియమాలు :

మద్య, మాంసాదులు వర్జించాలి, మత్తు పదార్థాలు దరికి రానీయకూడదు. ఏవిధమైన జూదము ఆడరాదు. పరస్త్రీ సంగమం పనికిరాదు. సాత్త్వికాహారము స్వీకరించవలయును. చివరకు కోడిగ్రుడ్డు, కాఫీ, టీలు కూడా స్వీకరించరాదు. (ఆక్స్‌ఫర్డు ప్రొఫెసరు కృష్ణభక్తుని, ఇంగ్లీషు వానిని "Won't you drink even coffee?" కాఫీ అయినా త్రాగరా అని అడిగాను. ఆయన అనిన మాటలు ఈనాటికి నాకు గుర్తు. "Why, Coffee is not so important a thing as Krishna Bhakti." "ఏమిటి? కాఫీ అంత ప్రముఖమా కృష్ణభక్తి ముఖ్యము.") ఎవరో బ్రాహ్మణ కుటుంబములో వారు సాత్త్వికాహార సేవన చేయుట కాదు. సర్వవిధములైన భౌతిక వాంఛలు, మత్తు పదార్థములకు బానిసలై, జూదములాడుచు జీవించెడి వారిని ఈవిధమగు నూత్న విధానమునకు మార్చుట. మత్స్యములను తినెడి వంగబ్రాహ్మణ వంశమునందు జన్మించియు, శ్రీప్రభుపాదులు ఈ కఠోర జీవన విధానము, సాత్త్విక భక్తిభావన, కృష్ణార్పణ భక్తి వృద్ధిపొందించుట విశేషము. నేటికిని లండన్ నగరమున దారు నిర్మిత రథముపై జగన్నాథ రథము ఊరేగించుట ఎంతటి విశేషము.

## తులసి పూజ; గోసేవ :

ఉదయము మూడు గంటలకే మేల్కొని కృష్ణ మందిరము పరిశుద్ధముగావించి, రాధాకృష్ణులకు నూత్న వస్త్రాలంకరణ చేసి, శంఖము పూరించగా తమ తమ గదులలో కఠిన శయ్యల నిదురించి మేల్కాంచి కాలకృత్యములు దీర్చుకొని తిలకధారణ, తులసిమాల, జపమాల కల్గిన సంచి మెడను ధరించి తులసి చెట్టు చుట్టును ప్రదక్షిణము చేయుచు ప్రతి భక్తుడు ఒక చంచా తులసి మూలమున వదలి, పిదప ఉదయం భోజనము ఎనిమిది గంటలకు మరల మధ్యాహ్నము రెండు గంటలకు, రాత్రి పాలు, పండ్లు స్వీకరించుట.

## ప్రభుపాదుల బోధనలు :

మానవజన్మ తదితర ప్రాణులకంటె ముఖ్యం. తన ఉనికి గురించి, తన స్వభావాన్ని గురించి, భగవత్ స్వభావాన్ని గురించి, తన నిజ స్వరూపాన్ని గురించి మానవుడు తప్ప మరే ఇతర ప్రాణి ఆలోచించదు. "నేను యజమానిని, ప్రతి వస్తువు నాది" అనుకొనుట మాయ. సమస్తం కృష్ణునిది. కృష్ణ చైతన్యం సాధించుటయే జీవితాశయం. ఆధ్యాత్మిక జీవితం అంటే శూన్యం కాదు. అది వాస్తవమైన జీవితం. అది శాంతి పూరితం, జ్ఞాన సంపూర్ణం. భౌతిక ప్రపంచంలో ఏ పదవీ శాశ్వతం కాదు. మూడు రోజుల పాటు మనం ఏ ఇంటినైనా తీసుకొన్నప్పుడు దానిని అలంకరిస్తామా?

## ప్రభు పాదుల రచనలు :

ప్రాచీన గ్రంథములైన శ్రీ మద్భాగవతము ఆంగ్ల వ్యాఖ్యతో, "Bhagavad Gita as it is" అనే గ్రంథము "శ్రీ చైతన్య చరితామృతం" 48 పెద్ద పెద్ద సంపుటాలుగా ప్రచురింపబడినవి. అవిగాక 22 గ్రంథాలు కూడా వ్రాశారు. శ్రీ మద్భాగవత సంస్కృత శ్లోక ఉచ్చారణ పాశ్చాత్యుల అవసరాలకూ క్యాసెట్టు రూపంలో వెలువడినాయి. వారి ఉపన్యాసాలు, భజనలు క్యాసెట్లు ఇప్పటికి హరేకృష్ణ మందిరాలలో భక్తులకు లభిస్తాయి. "భక్తి వేదాంత బుక్ ట్రస్ట్" వారు వీటిని ప్రచురించి భక్తులకు లభింపచేస్తారు.

1965 నుండి 1977 వరకు గల 12 ఏండ్ల స్వల్ప కాలంలో ఇన్ని బృహత్తర గ్రంథాలు రచించుట మానవాతీత మైన కృషి. మొదట్లో ఒక అమెరికన్ వనిత ఆతిథ్యం ఇచ్చి శ్రీవారికి వంటగది, పడక గది ఏర్పాటు చేసింది. ఆమె "Way to God head" అనే ఇస్కాన్ వారి మాసపత్రికలో "స్వామి వారి పారిశుద్ధ్యానికి నేనెప్పుడూ ఆశ్చర్యపడేదాన్ని. ఆ మూడు జతల బట్టలు ప్రతి దినం ఉతికి ఎంతో పరిశుభ్రంగా ఉండేవారు. తన ఆహారం తాను పక్వం చేసేవారు."

తొలి రోజుల్లో స్వామివారు ఒక చెట్టుక్రింద కూర్చుండి కరతాళధ్వనులతో భజన చేస్తుంటే తెల్లవారు వచ్చి కాస్సేపు నిలబడి వెళ్ళిపోయేవారట. తదుపరి ఆయన చేసిన ప్రసాదం శ్రీకృష్ణునికి నివేదన చేసినది, తెల్లవారికి పెట్టేవారట. ఎంత బాగుంది. 'ఎంత శాంతిగా ఉంది?' అని తినటం మొదలు పెట్టారుట. జనం ఎక్కువైనారట. పూరి జగన్నాథంలో పెట్టే "కొత్తిమీర అన్నం" (ఇప్పటికి హరేకృష్ణ మందిరాలు అన్నిచోట్ల దేశవిదేశాలలో అదే ప్రసాదం మక్కువతో ఆరగించేవారట. శ్రీల ప్రభుపాదులు వైష్ణవ కుటుంబంలో జన్మించిన వారు గనుక ప్రసాదాలు సాత్వికంగా చేసి పంచి పెట్టుంటే శిష్యగణం పెరగటం మొదలైంది. ఈ అమెరికన్లకి, ఈ భౌతిక భోగలాలసులకు కృష్ణభక్తి ఎలా నేర్పగలనా అని సందేహం కల్గిన స్వామి నవ్వుతూ ఒకసారి ఇలా అన్నారు. "అమెరికా వారిని ఆహారం (శ్రీకృష్ణ ప్రసాదం) తో పడవేశాను" అంటే అమెరికన్, విదేశ శిష్యులు నవ్వుకుంటారు. శ్రీ ప్రభుపాదులు మనదేశంలోని బృందావనంలో 1977లో పరమపదించారు.

## హైద్రాబాద్‌లోని హరేకృష్ణ లాండ్ :

నగరం నడిబొడ్డులో ఆబిడ్స్ వద్ద బృందావన్ హోటలు ఎదురు సందులో శ్రీ పుల్లారెడ్డి స్వీట్స్ అధినేతకు తన స్వీట్సు చేసే కార్ఖానాకొరకు కొంత ఖాళీస్థలం ఉంది. శ్రీ రెడ్డిగారు సహజంగా ఉదారపురుషుడు, అనేక సంస్థలకు భూరివిరాళాలు అందించారు. శ్రీల ప్రభుపాద వారితో ఆ ఖాళీ స్థలంలో కొంత భాగం మాకిస్తే అచ్చట శ్రీ కృష్ణ మందిరం నిర్మిస్తామని కోరగనే శ్రీ రెడ్డిగారు దానికి అంగీకరించటం,శ్రీల ప్రభుపాదులు శంఖుస్థాపనతో ఎంతో నిర్మలంగా ఉండే పాలరాతితో హరేకృష్ణ మందిరం నెలకొల్పబడింది. నేటికీ సాయంత్రం ఆఫీసులలో పనిచేసి ఇండ్లకు వెళ్ళేటప్పుడు ఈ మందిరానికి వచ్చి భజన చేసి ప్రశాంత హృదయంతో హారతి కళ్ళకు అద్దుకుని వెళ్తూ ఉంటారు. పూరి జగన్నాథ రథం పురవీధుల్లో అందరి చేత త్రాడు లాగిస్తూ జరుపుతూ ఉంటారు. సాయంత్రం ఈ హరేకృష్ణ మందిరానికి హైకోర్టు జడ్జీలు వచ్చి కాస్సేపు కూర్చుండి వెళ్ళటం నేను చూచాను. ఈ హరే కృష్ణ మందిరంలో సెల్లార్‌లో ఒక గదిలో కూర్చుని 'కళాప్రపూర్ణ' శ్రీ తిరుమల రామచంద్ర నిరాడంబరమైన రీతిలో శ్రీల ప్రభుపాదుల ఆంగ్ల రచనలు తెలుగున తర్జుమా చేస్తూంటే నేను పలుకరించి పరిచయం చేసుకొనటం నా అదృష్టం. అలాగే నేటి అధ్యక్షుడు "శ్రీ ఆనందమయిదాస్" (ఫ్రెంచి) శిరోముండనం, శిఖ, తెల్లని వస్త్రములు ధరించి తులసిమాల, జపమాలలతో నవ్వు చిరునవ్వున కొద్ది వాక్యాలతో యోగక్షేమాలు అడిగిన ఆనాటి మిత్రుడు 'ఆనందమయి" దీక్షపొంది శ్రీ ఆనందమయిదాస్‌గా హైద్రాబాద్ కృష్ణమందిర కార్యక్రమాలు నిర్వహించటం గొప్ప విశేషం. సుమారు 20 సంవత్సరాలు పైబడిన సత్సాంగత్యం మాది. ఉత్తమ భక్తుడు. తన శిష్య బృందంతో ప్రత్యేక వ్యానులో బందరు వచ్చి మమ్మలను దర్శించి, డా॥ చిత్తర్వు బాపూజీ ఇంట్లోనూ, గుడ్లవల్లేరులోనూ వారు చేసిన సంకీర్తనానందం మరువలేనిది.

పుస్తకాలు కావలసిన వారు "భక్తి వేదాంత బుక్ ట్రస్ట్", హరేకృష్ణలాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్డు, హైద్రాబాద్ - 500 001. ఇస్కాన్ (హరేకృష్ణ) జీవిత సభ్యులుగ చేరదలచిన వారు శ్రీ ఆనందమయిదాస్ పేరిట ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవచ్చును. ●

వ్యక్తులు - వ్యక్తిత్వాలు - 92

# ఆంధ్రా అనీబిసెంటు బత్తుల కామాక్షమ్మ

ఈ శతాబ్దం మొదటి అర్ధభాగంలో రాజమండ్రిలో ఆణిముత్యాలనదగ్గ మహిళలు ఉండేవారు. 1921లో మహాత్మాగాంధి రాజమండ్రికి వచ్చినప్పుడు ఈ పట్టణ మహిళలను ఎంతగానో ప్రశంసించారు. రాజకీయ రంగంలో మద్దూరి వెంకట రమణమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, గుమ్మడిదల దుర్గాబాయి, పాలకోడేటి శ్యామలాంబ సాహిత్య రంగంలో ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మ, పులవర్తి కమలాదేవి ప్రముఖులు కాగా, విద్యారంగంలో 'ఆంధ్రా అనీబిసెంటు'గా ప్రసిద్ధి పొందిన విదుషీమణి బత్తుల కామాక్షమ్మ గారు.

రాజమండ్రిలో గోదావరి గట్టున ఉమామార్కండేయ స్వామి వారికి అత్యంత సమీపంలో ఉన్న వైశ్య సేవాసదనం ఆ పట్టణ ప్రముఖ విద్యాకేంద్రాలలో ఒకటి- దీన్ని స్థాపించింది రాజమండ్రి పట్టణ వైశ్య ప్రముఖులు నాళం రామలింగయ్య గారు. ఈ సేవాసదనాన్ని సమర్ధవంతంగా ఆదర్శప్రాయంగా నడిపించగల కార్యదక్షత, సేవాతత్పరత గల మహిళకోసం అన్వేషిస్తున్నప్పుడు బత్తుల కామాక్షమ్మ గారిపై ఆయన దృష్టి పడింది. అంతే దాని నిర్వహణ బాధ్యతను రామలింగయ్య గారు కామాక్షమ్మ గారికి అప్పగించారు.

కామాక్షమ్మగారు 'పరోపకారార్ధం ఇదమ్ శరీరమ్' అనే సూక్తిని నమ్మినామె. మానవసేవలో మాధవ దర్శనం చేసుకొన గలిగిన సాధ్వి. పదమూడవ ఏటనే కట్టుకున్న భర్తను, కన్న తండ్రిని కోల్పోయింది. ఇది భగవంతుని సంకల్పం- ఆవిడ భర్త జీవించి ఉంటే ఆదర్శ గృహిణి అయిఉండేది. ఆమె సేవలు ఆమె కుటుంబానికే పరిమితమయి ఉండేవి. కాని ఈ వియోగాన్ని కల్పించడం ద్వారా కామాక్షమ్మ విస్తృత సమాజసేవను భగవంతుడు సంకల్పించాడు.

తండ్రి, భర్త పోయినందుకు కామాక్షమ్మ దిగులుపడలేదు. ఆనాటి పౌరాణిక, సాహిత్య గ్రంధాలను పఠించి వాటిసారాన్ని ఔపోసనపట్టి దానిని ఇతర స్త్రీలకు అందచేసి వారిని చైతన్యవంతులను చేసేది. ఆమె ధర్మ నిష్ఠ, సంఘటనాశక్తిని రామలింగయ్యగారు గుర్తించారు. అందుకనే వైశ్య సేవా సదన నిర్వహణ అనే మహత్తర బాధ్యతను అప్పగించారు. అప్పటినుండి 36 సంవత్సరాల వరకు సేవాసదనమే తానుగా, తానే సదనముగా భావించి అకుంఠిత దీక్షతో కామాక్షమ్మగారు పనిచేశారు. అందువల్లనే సేవాసదనాన్ని చూడగానే కామాక్షమ్మ గుర్తుకు వస్తారు.

## కంచి వాసుదేవరావు

### ద్విముఖ సేవలు

కామాక్షమ్మ తన బాధ్యతలను ద్విముఖంగా నడిపారు. ఒకటి స్త్రీలలో విద్యావ్యాప్తి, రెండు అనాధ స్త్రీ జనోద్ధరణ. సేవాసదనం ద్వారా వందల సంఖ్యలో స్త్రీలను విద్యావంతులను చేశారు. వారిలో ధర్మశీలతను పాదుకొల్పారు. వారిని ఉత్తమమహిళలుగా తీర్చిదిద్దారు. భర్తను కోల్పోయిన, తల్లిదండ్రులను కోల్పోయిన బాలికలను తీసుకు వచ్చి సేవాసదనంలో ఆశ్రయం కల్పించారు. వారు స్వశక్తిమీద నిలబడి జీవితాలను గడుపగల స్థితిని సమకూర్చారు. వారిలో నిద్రాణంగా ఉన్న సంగీత సాహిత్యాది కళాభిరుచులను గుర్తించి వాటిని బయటకు తీసుకువచ్చి ఆ విద్యలలో రాణించేట్టు చేశారు. తన దగ్గరకు వచ్చిన వారిలో సంపూర్ణ వ్యక్తిత్వాన్ని వికసింప చేశారు. ఈనాడు స్త్రీల హక్కులు, పురుషాధిపత్య ధిక్కరణ, ఉద్యోగాలు పదవులలో రిజర్వేషన్ల సాధనకు మహిళా నాయకులు కృషి చేస్తున్నారు. కాని ఆనాడు మహిళా నాయకులు స్త్రీని ఉత్తమ గృహిణిగా, విద్యా వివేక వంతురాలిగా చేసేందుకు కృషిచేసేవారు.

కామాక్షమ్మ మహాభక్తురాలు. ఆధ్యాత్మిక పరాయణురాలు. నిత్య సాధకురాలు, యోగాసనాలను వేసేవారు. ప్రతి ఉదయం గోదావరి స్నానానికి వెళ్ళి ఆ జలాలలో పద్మాసనం వేసి సాధన చేసేవారుట. ఆవిడ హృషీకేష్‌లో ఉండగా గంగానదిలో యోగ విద్యా ప్రదర్శనను తిలకించిన స్వామి శివానంద అచ్చెరువొంది జలస్తంభన దీపిక అన్న బిరుదుతో సత్కరించారుట. ఆధ్యాత్మిక చింతన విద్యావ్యాప్తి, సమాజ సేవ ఆవిడతో త్రివేణీ సంగమంలా మేళవించాడు. వీటితో పాటు అనేక పదవులను ఆవిడ నిర్వహించారు.

## వివిధ పదవులు - సత్కారాలు

1924 సం॥లో గుంటూరులో రాష్ట్ర ఆర్య వైశ్య మహిళా సభకు కామాక్షమ్మ అధ్యక్షత వహించారు. 1936వ సంవత్సరంలో భద్రాచలంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళా సభకు ఆవిడే అధ్యక్షురాలు. 1946లో నంద్యాలలో ఆంధ్ర మహాసభలు జరిగినప్పుడు ఎగ్జిబిషన్ విభాగానికి ఆమె అధ్యక్షురాలు. రాజమండ్రి మున్సిపల్ కౌన్సిలర్‌గా, బెంచి మేజిస్ట్రేటుగా పట్టణానికి తనసేవలనుఅందించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యురాలుగా క్రియాశీలక పాత్రను నిర్వహించారు.

స్త్రీలపాలిట కల్పతరువు అయిన లోధ్ర వంటి ఆయుర్వేద ఔషధాల ఉత్పత్తిదారులూ గృహలక్ష్మి సంపాదకులయిన ఎ.ఎన్.కేసరి ప్రతి సంవత్సరం ఒక విశిష్ట మహిళకు స్వర్ణకంకణాన్ని బహూకరించేవారు. ఇది మహిళలకు విశిష్ట పురస్కారంగా గుర్తించబడింది. సహజంగానే ఈ స్వర్ణకంకణం ఒకసారి కామాక్షమ్మగారిని వరించింది. శ్రీ పొలస వెంకన్న గారు నవరత్నఖచిత స్వర్ణపతకంతో సత్కరించారు. సింహతలాట సత్కారాన్ని కూడా ఆమె పొందారు. ఆంధ్రా అనీబిసెంటు విద్యాప్రదాయిని, సంఘసేవాధురీణ వంటి బిరుదులు ఆవిడను వెతుక్కుంటూ వచ్చాయి. అన్నిటికన్న గొప్పవిషయం రాష్ట్రప్రభుత్వం ఈవిడ జీవిత చరిత్రను డాక్యుమెంటరీ ఫిల్ముగా చిత్రించడం.

కామాక్షమ్మ సహస్రమాస జీవి. ఎన్నిపదవులు పొందినా నిరాడంబర జీవితాన్ని ఆమె వదలలేరు. తను జీవించి ఉండగానే తన ఆస్తిని, వస్తుసామాగ్రిని దానం చేశారు. సమాజమే తనకుటుంబంగా, సమాజ సేవే తన ఊపిరిగా జీవించిన కామాక్షమ్మ తెలుగుమహిళా ఆణిముత్యాలలో ఒకరు. ☆

# మూఢ విశ్వాసాలను పారద్రోలండి !

చాలా విచిత్రంగా పెరటిలోని అరటిచెట్టు నడుమనుండి చీల్చుకుని పువ్వు పైకి వచ్చింది. ఈ వింతను చూడటానికి చాలామంది వచ్చారు. "ఇది అరిష్ట సూచకము. ఈ చెట్టు కొట్టెయ్యాలి" అని ఇంట్లోని వ్యక్తికి కొందరు సలహా ఇచ్చారు. అతను వారి మాట వినలేదు. గెల పెద్దదయ్యాక కాయలు కూరకి వాడుకున్నాడు. అంతేకాదు చెట్టు కొట్టించి దూట కూడా కూరగా వాడుకున్నాడు.

ఒకసారి అతని ఇంటిలో దూలానికి తేనెపట్టు పట్టింది. ఇది అశుభసూచకము. దానిని తొలగించి శాంతి చేయించుకోమని కొందరు ఇచ్చిన సలహాలను అతడు వినలేదు.

అతనికి ఉపాధ్యాయునిగా ఉద్యోగం వచ్చింది. అమావాస్యనాడు బయలుదేరి వెళ్ళి పనిలో చేరాడు.

ఇటువంటివన్నీ నాకు అపకారం కలిగించ లేదు. నాకే కాదు ఎవరికీ అపకారము కలిగించవు. మీ మనసుల నుండి మూఢ విశ్వాసాలను పారద్రోలండి! అని చెప్పిన వ్యక్తి ఎవరో కాదు. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు. ఆయన ప్రత్యక్షంగా నిరూపించిన విషయాలు ఇవి.

- ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# ప్రభావతీదేవి కన్నుమూత

లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ విద్యార్థి జీవితం ఆర్థిక యిబ్బందులలో గడిచింది. కళాశాల చదువుకోసం, బట్టల దుకాణంలో లెక్కలు రాసి డబ్బు గడించాడు. పై చదువుల కోసం అమెరికా వెళ్ళి, అక్కడి తోటి భారతీయుల సహాయంతో కాలేజిలో చేరాడు. సాయంత్రం వేళల్లో తోటల్లో కూలీగా పనిచేస్తూ, పేపర్‌బాయ్‌గా పనిచేస్తూ, హోటళ్ళలో కొంతకాలం పనిచేస్తూ ఎం.ఎస్.సి. పూర్తి చేసి 1928లో మాతృదేశానికి తిరిగి వచ్చాడు.

గాంధీజి అనుయాయిగా రాజకీయ రంగ ప్రవేశం చేశాడు. పలు ఉద్యమాలకు నాయకత్వం వహించాడు. కారాగార శిక్షలనుభవించాడు.

సాంఘిక సేవా కార్యక్రమాల్లో తనతో నిర్విరామంగా కృషి చేస్తూ వచ్చిన ప్రభావతి దేవిని పెళ్ళాడాడు. నవ దంపతులిర్వురూ ఆశీస్సుల కోసం గాంధీజిని దర్శించారు. స్వరాజ్యం వచ్చేదాక బ్రహ్మచర్య దీక్షలో ఉంటామని గాంధీజీ ఎదుట ప్రతిన పూనారు.

గాంధీజి ఆగాఖాన్ భవనంలో ఖైదీగా ఉన్నపుడు, ఆయన పరిచర్యల కోసం ప్రభావతి బాపూజీ వద్ద ఉండేవారు. జయప్రకాశ్‌తోపాటు అన్ని కార్యాల్లో పాల్గొంటూ, దేశమంతటా పర్యటించారు ఆదంపతులు.

ప్రభావతి దేవి ఆరోగ్యం దెబ్బతిన్నది. ఢిల్లీలోని ఆలిండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో చికిత్స కోసం ఆమెను చేర్చారు. వైద్యులు ప్రభావతీ దేవి క్యాన్సర్ వ్యాధితో బాధపడుతున్నట్లుగా జయప్రకాశ్‌గారికి తెలిపారు.

వ్యధిత హృదయుడైనా, ఎంతో నిబ్బరంతో, జయప్రకాశ్, ఆమె వ్యాధిని గురించి చెబుతూ

"ప్రభూ, నీకంటే ముందు చనిపోతానని భావించాను. కాని విధి విచిత్రమేమో, నీవే ముందుగా కన్ను మూసేటట్లుంది" అన్నాడు. ప్రభావతి ఏమాత్రం చలించలేదు. ఎంతో నిబ్బరంగా, భర్తను ఓదారుస్తూ వెంటనే మిత్రులను, సహ కార్యకర్తలను, ఢిల్లీలోని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ అతిథి గృహంలో సమావేశ పరచమని కోరింది. జయప్రకాశ్ వివాహ విందుకు ఎందరు వచ్చారో తెలియదు. కాని, విషాదకరమైన వీడ్కోలు పలికే ఆ సమావేశానికి చాలామంది క్షణాల్లో వచ్చారు.

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

అందరూ ప్రభావతి దేవి త్వరలో కోలుకోవాలంటూ తమ హార్దిక శుభాకాంక్షలు అందచేశారు. గుండెలో దాగిన కఠోర విషాదాన్ని దాచుకుంటూ అందరికీ వీడ్కోలు పల్కింది.

మూడో రోజున ప్రభావతీ దేవి కన్నుమూసింది. అన్యోన్యానురాగంతో నిరంతర దేశ సేవలో గడిపిన ప్రభావతి వియోగంతో జయప్రకాశ్ కార్చిన అశ్రువులు ప్రభావతీదేవి అంత్యక్రియల్లో పాల్గొన్న జనవాహిని కన్నీళ్ళల్లో కరిగిపోయాయి. ప్రియమైన తమ 'దీది' కోసం వేలాది ప్రజలు కార్చిన కన్నీరే జయప్రకాశ్‌కు ఊరట నిచ్చాయి. ✯

## విదురనీతి

"బుద్ధ్యాభయం ప్రణుదతి
తపసా విన్దతే మహత్
గురు శుశ్రూషయా జ్ఞానం
శాన్తిం యోగేన విన్దతి"

మానవుడు బుద్ధితో భయమును దూరము చేసుకొనును. తపస్సుచేత గొప్ప స్థితిని పొందును. గురుశుశ్రూషచేత జ్ఞానమును పొందును. యోగము చేత శాంతిని పొందును.

# వల్లభాచార్యుడు

మనకు ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం అని మూడు మతశాఖలున్నాయి. ఇవిగాక శుద్ధ అద్వైతమని ఇంకో శాఖ కూడా ఉంది. ఈ శాఖ ఎక్కువగా ఉత్తర హిందూస్థానంలో ప్రచారంలో ఉంది. కాని దీనిని స్థాపించిన వల్లభాచార్యులు మాత్రం తెలుగువాడు.

15వ శతాబ్దానికి చెందిన ఈయన తండ్రి లక్ష్మణభట్టు. కృష్ణా గోదావరీ మధ్య దేశంలో కాకరవాడ కు చెందినవారు. తల్లి ఎల్లమ్మ. వీరు కంభంపాటి వారు. లక్ష్మణభట్టు, ఎల్లమ్మ కాశీకి వెళుతుండగా రాయపూర్ దగ్గర ఎల్లమ్మ ప్రసవించి వల్లభుని కన్నది.

వల్లభాచార్యులు చిన్నతనంలోనే వేద వేదాంగాలను పుక్కిట బట్టిన ప్రతిభాశాలి. జ్ఞాన, కర్మ, భక్తి సిద్ధాంతాలకు నూతనార్థాలు చెప్పి, పుష్టి మార్గమనే కొత్త సిద్ధాంతాన్ని ఈయన ప్రచారం చేశారు. "పరిశుద్ధమైన ప్రేమతో పరమేశ్వరుని ఆరాధించు. మోక్షాన్ని ఆపేక్షించి కాదు. ఆయన పట్ల నిర్మలమైన ప్రేమ నీలో ప్రేమశక్తిని పెంపొందిస్తుంది. ఈశ్వర సన్నిధానం కల్పిస్తుంది. నీలో పరిపూర్ణ సానుభూతిని కల్పించి ఆనంద ప్రాప్తి కల్గిస్తుంది. ఇందుకు కులం, మతం, జాతి అడ్డం రావు. స్త్రీ, పురుష వివక్షత పాటింపు లేదు," అని ఆయన బోధించారు.

ఈ శాఖవారు పూజించే భగవంతుడిని గోపీ జన వల్లభుడంటారు. పరమ పవిత్రమైన గోపికల ప్రేమ వీరికి ఆదర్శం. ప్రతి భక్తుడూ తనను గోపికగా భావించుకొని, గోపీజన వల్లభుని ప్రేమతో ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందే ప్రయత్నం చేస్తాడు. గోపీజన వల్లభుడినే గోవర్ధన నాథుడనీ, నాథ్‌జీ అని అంటారు. ప్రస్తుతం రాజస్థాన్‌లో ఉన్న నాథ్‌ద్వారా ఈ శాఖీయులకు ముఖ్య తీర్థ స్థానం.

పుష్టి మార్గంలో సేవా మార్గానికి ప్రత్యేక స్థానం ఉంది. ఈశ్వర సేవ మోక్షసాధనం. వల్లభాచార్యులు గంగానదీ జలాలలో జల సమాధి పొందారు. అలా సమాధి పొందే ముందు ఆయన "ప్రతి వ్యక్తి తన శక్తి కొలది ఈశ్వర సేవ చేయాలి. స్నేహం, ప్రేమ అలవరచుకోవాలి. ఈశ్వరునికి సొంతమై పోవాలి," అని బోధించారు.

వల్లభాచార్యులు తన మార్గం వేదసమ్మతమని నిరూపించారు. వేదాలకు, బ్రహ్మసూత్రాలకు, భగవద్గీతకు, భాగవతానికి ఆయన భాష్యాలు రచించారు. "వేదాలలో సందేహాలు భగవద్గీతలో తీరతాయి. భగవద్గీతలో సందేహాలు కలిగితే భాగవతం తీరుస్తుంది." అని ఆయన చెప్పారు.

శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులను ఆచార్య చతుష్టయం అంటారు. ఆయన ఆసేతు హిమాచలం పర్యటించారు. కృష్ణదేవరాయల ఆస్థానంలో ఆయన చర్చలు జరిపి అందరినీ మెప్పించారు. కనకాభిషేకం పొందారు. ఆయన మతానికి చెందిన సాహిత్యం సంస్కృతం, హిందీ, గుజరాతీ, వ్రజ భాషలలోను, ఆంగ్లంలోను లభిస్తున్నది. ✠

- భండారు పర్వతాలరావు

## యక్షప్రశ్నలకు సమాధానాలు

" పఠకాః పాఠకాశ్చైవ
యేచాన్యేశాస్త్ర చింతకాః
సర్వే వ్యసనినో మూర్ఖా
యః క్రియావాన్ స పండితః"

శాస్త్రాదులను చదివేవాళ్ళు, చదివించే వాళ్ళూ, ఎల్లప్పుడు వాటిని ఆలోచించేవాళ్ళూ వీరంతా విద్యావ్యసనం కల మూర్ఖులేకాని విజ్ఞులు మాత్రం కాజాలరు. శాస్త్రాల్లో చెప్పబడ్డవాటిని ఆచరించునట్టివాడే విజ్ఞుడు.

# కాళరాత్రీ దేవి

ఏకవేణీ జపాకర్ణ పూరా నగ్నా ఖరాస్థితా.
లంబోష్ఠీ కర్ణికాకర్ణీ, తైలాభ్యక్త శరీరిణీ
వామపాదోల్లసల్లోహ తాటంక భూషణా
వర్ధన మూర్ధ ధ్వజా కృష్ణా కాళరాత్రిర్భయంకరీ.

దుర్గాదేవి యొక్క సప్తమ శక్తి కాళరాత్రీ నామంతో ఖ్యాతి గాంచినది. ఈమె శరీరం ఘనాంధకార సమంగా పూర్తిగా కాలవర్ణంలో ఉంటుంది. శిరోజాలు చెల్లాచెదరై ఉంటాయి. గళసీమలో విద్యుత్ సమంగా భాసిల్లే హారం ఉంది. ఈమెకు గల త్రినేత్రాలూ బ్రహ్మాండ సమంగా గోళాకారంలో ఉంటాయి. ఈమె నుండి విద్యుత్ సమంగా భాసిల్లే కిరణాలు బహిర్గతమవుతూంటాయి. ఈమె నాసిక నుండి ఉచ్ఛ్వాస, నిశ్వాసాల ద్వారా భయంకర ప్రజ్వలితాగ్ని జ్వాలలు బహిర్గతమవుతుంటాయి. గార్దభం ఈమె వాహనము. పైకి లేచి ఉన్న దక్షిణ హస్తవరద హస్తం ద్వారా సర్వులకూ వరాలను ప్రసాదిస్తూంటుంది. దక్షిణంగా క్రింది భాగంలో ఉండే హస్తం అభయముద్రలో ఉంటుంది. వామ భాగంలో పైకిలేచిన హస్తంలో లోహ కంటకమూ, క్రింది చేతిలో ఖడ్గమూ ఉన్నాయి.

కాళరాత్రీదేవి స్వరూపం చూడ అత్యంత భయంకరంగా ఉన్నా ఈ తల్లి సర్వదా శుభఫలాలనే ప్రసాదిస్తుంది. ఈ కారణం వల్లనే ఈమెకు శుభంకరీ అన్న నామం ఏర్పడిఉంది. కనుక భక్తులు ఎంత మాత్రం ఈమెకు భయపడడంకాని, ఈమె వల్ల విపత్తులు ఏర్పడతాయని కానీ భావించకూడదు.

దుర్గాపూజలో ఏడవనాడు కాళరాత్రీ దేవిని ఆరాధించే విధానం ఉంది. ఆ రోజున సాధకుని మనస్సు సహస్రార చక్రంలో స్థితమై ఉంటుంది. సాధకునకై బ్రహ్మాండంలో ఉన్న సిద్ధి ద్వారాలన్నీ తెరచుకుని ఉంటాయి. ఈ చక్రస్థితుడై ఉన్న సాధకుని మనస్సు పరిపూర్ణంగా కాళరాత్రీదేవి స్వరూపంలో లయమై ఉంటుంది. ఆ జననీ సాక్షాత్కారం వల్ల ప్రాప్తమగునట్టి పుణ్య సర్వస్వాన్ని అతడు పొందగలుగుతాడు. అట్టి భక్తుని పాప, విఘ్న సర్వస్వం నశిస్తుంది. అట్టి వానికి అక్షయ పుణ్యలోకాలు లభిస్తాయి.

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

కాళరాత్రీదేవి దుష్టులను నాశనం చేసివేస్తుంది. దైత్య దానవ రాక్షస భూత ప్రేతాదులు ఈ జనని స్మరణ మాత్రం చేతనే భయపడిపారిపోతాయి. ఈమెను ఉపాసించేవారికి అగ్ని భయ, జంతు భయ, శత్రుభయ, రాత్రి భయాలన్నవేవీ ఉండవు. కాళరాత్రీ దేవి కృప వల్ల ఆ తల్లి భక్తుడు సర్వభయదూరుడవుతాడు.

కాళరాత్రీదేవి స్వరూప విగ్రహాన్ని తన హృదయంలో ఉంచుకొని సాధకుడు ఏకాగ్రభావంతో ఆమెను ఉపాసించాలి. యమ, నియమ, సంయమాలను అతడు పరిపూర్ణంగా పాటించాలి. మనోవాక్కార్మభిః పవిత్రుడై భక్తుడు వ్యవహరించాలి. ఆమె శుభకరీదేవి. ఆమెను ఉపాసించడం వల్ల లభించే శుభాలను వర్ణించజాలము. మనం నిరంతరం ఆమె స్మరణ, ధ్యాన, పూజాదులు కొనసాగిస్తుండాలి.

॥ కాళరాత్రీ దేవికీ జై ॥

**చందాలను వెంటనే రెన్యూవల్ చేయండి. క్రొత్త చందాదారులను చేర్పించి శ్రీవాణిని ప్రోత్సహించ ప్రార్ధన.**

# డా॥ బెనిటో రేస్

కాలిఫోర్నియాలోని ఒజాయి లోయలో ఉంటున్న డా॥ బెనిటో రేస్, ఆయన భార్య ఒకరోజు వాళ్ళ ఇంటికి తాళం వేసి, ఇద్దరు స్నేహితులతో కలిసి మరొక స్నేహితుని ఇంట్లో ఆరోజంతా గడిపి సాయంత్రానికి తిరిగి ఇల్లు చేరుకున్నారు. తాళం తీయగానే ఇల్లంతా పొగతో అగుపించింది. లైటు వేసినా ఏమీ కనుపించలేదు. అందరూ తలో గదిలోకి పరిగెత్తి నిప్పు ఎక్కడుందా అని వెదికారు. ఎక్కడా నిప్పు కనుపించలేదు. ఆ పొగ నిదానంగా సన్నని పొడిగా మారి వాళ్ళమీద, నేల మీద, ఇంట్లో సామాన్ల మీద పడుతూంది. డాక్టర్ రేస్ ఆ పొడి ఏమిటా అని వంగి చేతిలోకి తీసుకుని వాసన చూస్తే విభూతి వాసన వచ్చింది. కొంచెం నోట్లో వేసుకుని చూసి విభూతేనని నిర్ధారణకొచ్చాడు. ఇంత విభూతి వర్షంలా ఇల్లంతా ఎందుకు కురుస్తుందాని ఆలోచించాడు డాక్టర్ రేస్. వెంటనే రెండు విషయాలు జ్ఞాపకం వచ్చాయి, మొదటిది, కొంతకాలం క్రితం తను భారతదేశం వెళ్ళి శ్రీ సత్యసాయిబాబాని దర్శించినప్పుడు "నీకేమి కావలసినా నీ మనసుతోనే నన్ను అడుగు"అని స్వామి తనకిచ్చిన వరం. రెండవది కొద్దిరోజుల క్రితం తన ఇంట్లో ఉన్న స్వామి పటంమీద కొంచెం విభూతి వచ్చినపుడు అది తీసుకుని పొట్లంకట్టి, "స్వామీ, ఈ కొంచెం విభూతి నా స్నేహితులందరికీ ఇవ్వటానికి సరిపోదు. చాలా చాలా విభూతి ఇవ్వండి'' అని తను మనసులోనే స్వామిని ప్రార్థించిన విషయం ఆ కోరికకు సమాధానంగానే స్వామి తనతో ఆడుకోవటానికా అన్నట్లు చిలిపిగా తన ఇల్లంతా విభూతి వర్షంతో నింపేశారని ఎంతో సంబరపడ్డాడు డాక్టర్ రేస్.

డాక్టర్ రేస్ కల్మషంలేని వెన్నవంటి మంచి హృదయం గలవాడు. గొప్ప విద్యావేత్త. తత్వశాస్త్రం, సాహిత్యం ఇంకా అయిదారు విషయాలమీద పరిశోధించి డాక్టరేట్ డిగ్రీలు తీసుకొన్నాడు. ఫిలిప్పీన్స్ ప్రభుత్వం ఆహ్వానించి మనిలా విశ్వవిద్యాలయానికి అధ్యక్షునిగా నియమించింది. ఆయన ఆ విశ్వవిద్యాలయాన్ని ఎంతో అభివృద్ధి పరిచారు. కాని ఆయనకొక కోరిక మిగిలి పోయింది. ప్రపంచంలో ప్రతి విద్యాలయం ప్రాపంచిక జీవితానికి సంబంధించిన విషయాలనే బోధిస్తుందిగాని, ఆత్మజ్ఞానం గురించి అక్షరం ముక్కయినా నేర్పదు. మనిలా విశ్వవిద్యాలయంలో ఆత్మజ్ఞానం అంశం

డి. వెంకటేశ్వరరావు

ప్రవేశపెట్టాలనుకుంటుండగా అక్కడ ప్రభుత్వం మారి విదేశీయులందరూ ఈ దేశం వదిలి వెళ్ళవలసివచ్చింది. కట్టుబట్టలతో రేస్ దంపతులు అమెరికా చేరుకున్నారు. కాలిఫోర్నియాలో అందంగా ఉండే ఒజాయిలోయలో ఆధ్యాత్మిక విశ్వవిద్యాలయం స్థాపించాలని ఆయన కోరిక. దానికి నాందిగా తన స్నేహితుల సహాయంతో ఒక చిన్న పాఠశాల ప్రారంభించి అందులో ఆత్మజ్ఞానం గురించి బోధించాడు డాక్టర్ రేస్.

కొద్దిరోజులలో డాక్టర్ రేస్‌కు, ఆయన భార్యకు శ్రీమతి ఇంద్రాదేవి నడుపుతున్న యోగాశ్రమం దర్శించే అవకాశం లభించింది. అక్కడ స్వామి పటాలను, అందులోంచి వస్తున్న విభూతిని, పుట్టపర్తిలో డాక్టర్ బాక్ తీసిన సినిమాను చూశారు. శ్రీమతి రేస్‌కు పటంలోని స్వామి ముఖం ఏసుక్రీస్తు ముఖంలా మారటం కనిపించింది. ఆధ్యాత్మికంగా ఎంతో కృషి చేసిన డాక్టర్ రేస్‌కు, భగవంతుడే సత్యసాయి రూపంలో ప్రస్తుతం భూమి మీద అవతరించారని అవగాహన చేసుకోవటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆ క్షణంలో డాక్టర్ రేస్‌కు ఏమనిపించిందంటే, తను ప్రారంభించాలనుకున్న

ఆధ్యాత్మిక విశ్వవిద్యాలయం రూపుదిద్దుకోవటానికి ఈ ప్రపంచంలో ఎవరైనా సహాయం చేయగలిగిన వ్యక్తి ఉంటే ఆ వ్యక్తి స్వామి ఒక్కరే అని, అందుచేత వీలైనంత త్వరలో భారతదేశం వెళ్ళాలనుకున్నారు ఆ దంపతులు. అప్పటినుండి స్వామి ప్రతిరాత్రి డాక్టర్ రేస్ కలలో కనిపించేవారు.

కొంతమంది స్నేహితులు భారతదేశం వెళ్ళటానికి టికెట్లు కొనిఇచ్చారు. అమెరికా నుండి స్వామిని దర్శించే బృందంతో ఈ దంపతులు భారతదేశం చేరారు. మొదటి దర్శనంలోనే డాక్టర్ రేస్ ఒళ్ళు పులకరించింది. ఆ మర్నాడుదయం పుట్టపర్తిలో అమెరికా నుండి వచ్చిన ఆ బృందానికి స్వామి ఇంటర్వ్యూ ఇచ్చారు. ఆ బృందంలో ఎవరూ ఉదయం ఫలహారం తీసికోలేదు. స్వామి వాళ్ళకు జీడిపప్పులతో ఉన్న హల్వాను సృష్టించి ఇచ్చి ఆకలితీర్చారు.

ఆ బృందంలో ఉన్న భక్తులు స్వామికి డా॥రేస్ విద్యావేత్త అని తెలిపారు. "విద్య అంటే ఏమిటి?" అని ప్రశ్నించారు స్వామి. డా॥ రేస్ ఎన్ని సమాధానాలు చెప్పినా అవేమీ విద్య అనడానికి వీల్లేదన్నారు స్వామి. అప్పుడు డాక్టర్ రేస్ తన విద్యాలయాలలో ధ్యానం నేర్పుతున్నానని చెప్పాడు. "ధ్యానం అంటే ఏమిటి?" తిరిగిప్రశ్నించారు స్వామి. ఆ తర్వాత స్వామి విద్య గురించి, ధ్యానం గురించి మూడు గంటలు ఉపన్యాసం ఇచ్చారు.డా॥ రేస్‌దంపతులను సాయంత్రం మళ్ళీ కలుస్తామని చెప్పారు.

ఆ సాయంత్రం ఇంటర్వ్యూలో స్వామి డా॥రేస్‌ను "నీకేమి కావాలి?" అని అడిగారు. డా॥ రేస్ తడుముకోకుండా "ఒక విశ్వ విద్యాలయం..." ఆయన ఆ వాక్యం పూర్తి చేసేలోగా స్వామి "తథాస్తు, తథాస్తు" అని దీవించి "నీకు స్వంతానికి ఏమి కావాలి?" అని అడిగారు. " స్వామి .మీ చేతులను ముద్దు పెట్టుకుంటాను" అని అడిగిన డా॥ రేస్ కోరికను మన్నించారు స్వామి. స్వామి చేతులు మల్లెపూల వాసనలో ఉన్నట్లనిపించింది డా.రేస్‌కి. స్వామి ఆ మరునాడు ఉదయం అనంతపురం వెళ్తూ, డా.రేస్‌ను కూడా రమ్మన్నారు. స్వామి కారు వెనుక మరొక కారులో అనంతపూరు బయలుదేరాడు. దారిలో తన మనసులోనే ఇలా అనుకున్నాడు. తను అమెరికా వెళ్ళిన తర్వాత తన స్నేహితులకు స్వామి ఇచ్చారని ఏమి చూపించగలడు? స్వామి అన్న "తథాస్తు" అన్నమాట చూపించలేడుగదా! అలా అనుకొని స్వామిని తన మనసులోనే ఇలా ప్రార్థించాడు. "ఒక చిన్న ఉంగరం, ఎంత తక్కువ ఖరీదైనా సరే ఇప్పించండి స్వామీ"అని.

అనంతపురం చేరిన తర్వాత స్వామి డా॥ రేస్ దంపతులను తన దగ్గరకు పిలిచారు. కృష్ణుడి చిత్రం ఉన్న ఒక ఉంగరం సృష్టించి డా॥ రేస్ వ్రేలికి తొడుగుతూ "ఇందాక కారులో వస్తున్నప్పుడు నీవు ఉంగరం కావాలని నీ మనసుతో అడిగావుగదా. నీకెప్పుడు ఏమి కావల్సినా నీమనసుతోనే అడుగు. మాటలతో అడుగనక్కరలేదు" అనే వరంఇచ్చి " నీ విశ్వవిద్యాలయానికి ధనం కావాల్సివస్తే నాకు తెలియజేయి. నేను పంపిస్తాను." అని అన్నారు. శ్రీమతి రేస్‌కు ఒక లాకెట్ సృష్టించి ఇవ్వగానే ఆమె ఆనందబాష్పాలు కారుస్తూ వెక్కి వెక్కి ఏడ్చింది. స్వామి తన కుడిచేతిని క్రిందికి దించిపెట్టగానే ఆ అరచేతికి రెండు ప్రక్కల నుండి శివలింగంతో ఉన్న రెండు చెవిరింగులు జారిపడ్డాయి. స్వామి ఆ రింగులను స్వయంగా ఆమె చెవులకు తొడిగారు. ఆమెకు కూడా డా॥ రేస్‌కు ఇచ్చిన వరమే ఇచ్చారు. 'నీకేమి కావాల్సినా నన్నడుగు. నేనిస్తాను' అని ఆ దంపతులు స్వామి పాదాలను ముద్దిడి స్వామి వద్ద సెలవు తీసుకున్నారు.

వారు అమెరికా చేరినప్పటి నుండి విశ్వ విద్యాలయానికి కావల్సిన అన్ని ఏర్పాటులు వాటంతటవే జరిగిపోయాయి. చాలామంది ఆ విశ్వవిద్యాలయానికి ఆర్థిక సహాయం చేశారు. స్వామి ఆదేశంపై డాక్టరు రేస్ ఆ విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడయ్యాడు.

స్వామి అనుమతి, ఆశీర్వాదబలంతో ప్రపంచంలో స్థాపించబడిన మొట్టమొదటి విశ్వ విద్యాలయం అమెరికా దేశంలో, కాలిఫోర్నియా రాష్ట్రంలో, ఒజాయి లోయలో రూపుదిద్దుకున్న "ఒజాయి ఆధ్యాత్మిక విశ్వవిద్యాలయం" అని మనం అర్థం చేసుకుంటే ఆశ్చర్యపోకమానము. ◘

మనోభిరామం - 29

# మహోత్కృష్టము - మానవజన్మ

సకల జన్మల్లోను మానవజన్మే మహోత్కృష్టము. అయ్యది లభించడమే కడుదుర్లభము. జన్మజన్మల పుణ్యఫలములవలననే జీవులను మానవజన్మ వరిస్తుంది. సమస్త ప్రాణులకు ఆహార విహార మైథునాలు సర్వ సామాన్యమైన ధర్మాలు. ఆ ధర్మాలు నిర్వర్తించుట కొరకే ప్రాణులన్నీతమ జీవిత కాలాన్ని వినియోగిస్తాయి. మానవుడూ ఒక ప్రాణియే కదా! అందుచే మానవుడు మాత్రము తద్భిన్నముగ ఏల జీవించవలెననుకొనవచ్చును. కాని జీవులన్నిటి కన్నను భిన్నమైనది మానవుడు! ఏ ప్రాణికిలేని ప్రత్యేక లక్షణ మొకటి మానవునికి ప్రసాదించబడినది. అదే ధర్మ మార్గానుసరణ! అందుకు అవసరమగు యుక్తాయుక్త విచక్షణాజ్ఞానము, ఆలోచనాశక్తి, దైవచింతన ఇత్యాదులు మానవునికి దైవదత్తములు. కావున మానవుడు ఈ శక్తులను సద్వినియోగపర్చుకొని, జన్మరాహిత్య మోక్షము సాధించుకొనవలసి యున్నది. ఈ ధర్మసూక్ష్మాన్ని గ్రహించక, తన జీవిత కాలమంతయు వ్యర్ధముగ గడిపిన మానవుని జన్మ నిరర్ధకమై వృధా యగును.

"గతజన్మ వాసనేమో స్మృతి చేరదు- మరుజన్మ రూపమేదో మది తోచదు జన్మరాహిత్య సాధన కొరకె నరజన్మ రూపమొందినాము."- అన్న పరమ సత్యాన్ని గ్రహించడం మానవుల కత్యంతావశ్యకము. తనజన్మ యొక్క ప్రాధాన్యతను గుర్తించలేని అజ్ఞానాన్ని మానవుడు ముందుగా తొలగించుకోవాలి! ఎందుకంటే - ఈ మానవ జన్మాంతరము, భవిష్య జన్మనేదో, ఎలా ఉంటుందో ఎవరికి తెలియదు. అందుకనే మానవజన్మ సార్ధకత, గమ్యం, లక్ష్యం ఏమిటో ముందుగా తెలిసికోవాలి! ఆ లక్ష్యసాధనకై తీవ్రమైన కృషి సల్పాలి! జీవిత కాలములో చేయవలసిన, చేయదగిన కార్యములెన్నో నిర్దిష్టముగా ఉంటాయి. వానిని క్రమము తప్పకుండ నిర్వర్తించవలసియున్నది. విశ్వాసము లేనిదే ఏ కార్యమును సాధించలేము. ధర్మాచరణ వలననే మానవజీవిత పరమార్ధం లభించగలదన్న విశ్వాసాన్ని ప్రతి మానవుడు కలిగి ఉండాలి!

ధర్మార్ధ కామమోక్షాదులను గాని - ధర్మ మోక్షాదులను గాని సాధించుటయే మానవజన్మ ప్రయోజనము. ధర్మపురుషార్ధము వలన అనగా ధర్మాచరణ వలన అర్ధకామాలు కూడ లభిస్తాయి. అయినా ధర్మం అనిత్యం కాబట్టి మోక్షం మీదనే దృష్టికి లగ్నం చేయాలి! బ్రహ్మజ్ఞానం కలగడమన్నా మోక్షమన్నా ఒకటే! బ్రహ్మజ్ఞానం ఉదయించాలేగాని - ఉదయిస్తే మరి పోదు. కాబట్టి మోక్షం నిత్యం! అందుకే బ్రహ్మమెరిగినవాడు

**సోమంచి రామం**

బ్రహ్మం పొందుతాడంటారు. కర్మచేత గాని, సంతు చేత గాని, ధనంచేత గాని, దానంచేత గాని, ఎట్టివారికిని మృత్యువును తప్పించుకోవడం సాధ్యం కాదు. అందుచేత మానవుడు బ్రహ్మజ్ఞానం గురించి తెలుసుకోవాలి!

మానవులు రెండు రకాలు. ప్రాణులకు పునర్జన్మ కలదని , కర్మఫలమనుభవింపకతప్పదని, దైవమున్నాడని విశ్వసించేవారు ఆస్తికులు! తద్విరుద్ధంగా సుఖసంతోషాలే పురుషార్ధాలని - ఆనందో బ్రహ్మమని భావించేవారు నాస్తికులు!

ఆస్తికులైన, నాస్తికులైన ధర్మపథాన్ని విడనాడ నంతవరకూ వారి వలనమంచే జరుగుతుంది. ఈ విశ్వాసంతోనే మానవుడు తనకు నిర్దేశించబడిన విధులను నిర్వర్తించాలి! వచ్చే జన్మలోకూడ సుఖప్రదమైన జీవితం లభించాలనే కోరికతోనైనా, ఈ జన్మలో సత్కార్యాలనే చేయడమలవర్చుకోవాలి! పాపకార్యమైనా విధి నిర్ణయించిన విధిని నిర్వర్తించే వానికి ఏ పాపమూ అంటదని గీత బోధిస్తోంది. కావున మహోత్కృష్టమైన మానవజన్మ నెత్తినందుకు ప్రతి మానవుడు తన విధిని తాను నిర్వర్తించి తద్వారా తనకు, తనతోటివారికి ప్రయోజనకారి కాగలగాలి!

*మానవజన్మ పరమార్ధమదియే!*

# విద్య - విద్యార్థులు

"Education is for Life and not for Living" అని అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. అంతఃకరణమును పరిశుద్ధముగావించునదే అసలైన విద్య అని బాబా విశ్వాసం. విద్యారంగమును ప్రక్షాళన చేయాలనే పరమావధితో బాబా అనేక విద్యాలయములను నెలకొలిపి కె. జి. నుండి పి. జి. వరకు ఉచితంగా విద్యను గరుపుతున్నారు. అత్యంత అధునాతనమైన విద్యతోపాటు, ఆధ్యాత్మిక విద్యను కూడా మేళవించి బాలబాలికలకు విద్యను గడవటం ఆ విద్యాలయాల ప్రత్యేకత. స్వాతంత్ర్యానంతరం విద్యారంగంలో మార్పువస్తుందని పెద్దలు ఆశించారు. ఆశించిన మార్పురాకపోగా, నానాటికి విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యం పెచ్చుపెరిగిపోతున్నది. దీనికి కారణమేమిటి? విద్యార్థులు మాత్రమే దీనికి బాధ్యులుకారు. ఉపాధ్యాయులలో కూడా కొంతమంది తమబాధ్యతలను విస్మరిస్తున్నారు. ఈ యదార్థమును గమనించిన బాబా ఒక పర్యాయం తమ ప్రసంగంలో "ఒక విద్యార్థి చెడిపోతే దాని వలన అతనే పాడవుతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో తన కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు." అని అంటారు బాబా. అనటమే కాదు మొట్టమొదట ఉపాధ్యాయులకు శిక్షణా తరగతులను కూడా నిర్వహించారు.

"మార్కులు చూస్తే ర్యాంకులు, గుణం చూస్తే బ్లాంకులు, జీరోలు" అంటారు బాబా. ఇంతకు పూర్వం వారికన్నా ఈనాటి తరం విద్యార్థులు తెలివితేటలుగలవారే, ఎట్టి సందేహంలేదు. ర్యాంకులలో ఉత్తీర్ణులవుతున్నారు, బంగారు పతకాలు కూడా పొందుతున్నారు. అయితే వారిలో అసలు ఉండవలసిన గుణం మాత్రం కనిపించటంలేదు. గుణం ముఖ్యమా? ర్యాంకులు ముఖ్యమా? అంటే రెండూ రెండు చక్రాలుగా ఉండాలంటారు బాబా. కనుక తెలివితేటలతోపాటు గుణసంపత్తిని సంపాదించాలి. నైతిక, ఆధ్యాత్మిక శీలసంపత్తులను పెంపొందించుకోవాలి. అందువలననే "The end of Education is Character" అన్నారు బాబా.

శ్రీ సత్యసాయిబాబావారు ఒక పర్యాయం అధ్యాపకులను Water Tank తోనూ, విద్యార్థులను Tapతో పోలుస్తూ, Tank లో ఎటువంటి నీరు ఉంటే అటువంటి నీరే Tap ద్వారా లభిస్తుందని చెప్పారు. ఇది యదార్థం, వాస్తవం. అధ్యాపకులు ఆదర్శజీవితాన్ని గడిపిన రోజున విద్యాలయాలు ఆదర్శవంతంగా ఉంటాయని, విద్యార్థులు సత్ప్రవర్తనను అలవరచుకుంటారని బాబా విశ్వాసం. ఇది యదార్థం.

## కొమరగిరి కృష్ణమోహనరావు

"ఈనాడు Education (విద్య) అంటూ Agitation (ఆందోళన) ప్రేరేపిస్తున్నారు కొందరు గురువులు. Agitation కాదు, Elevation (ఔన్నత్యం)ను ప్రదర్శించాలి" అని అంటారు బాబా. విద్య హృదయకవాటమును తెరిపింపజేయాలి. అయితే ఈనాడు కేవలం Bookish Knowledge (పుస్తక విజ్ఞానం) మాత్రం పెరిగిపోతున్నదిగాని అనుభవజ్ఞానం అసలే ఉండటంలేదు. విచక్షణా జ్ఞానం ఏమాత్రం కనిపించటంలేదని చెబుతూ "ఈనాటి Bookish Knowledge రేపు Knowledge తరువాత Elergy గా వికటిస్తున్నది. అదికాదు. Knowledge దివ్యమైన Energy (శక్తి)గా మారాలిగాని Elergy గా మాత్రం కాదు" అంటారు బాబా.

ఒక పర్యాయం బాబా విద్యార్థుల సభలో ప్రసంగిస్తూ "మీ Marks కాదు నాకు కావలసినది, Remarks రాకుండా చూచుకోండి !" అని హెచ్చరించారు. బాబాచేసే ప్రసంగాలు, సూచనలు, హెచ్చరికలు అన్నీపైకి

KOHINOOR
Bangles
GOLD SHEET COVERED
ACID PROOF & CASH REFUNDABLE
ESTD:1901 PHONE:22630
25 YEARS GUARANTEE
KOHINOOR ROLLED GOLD
COMPANY (Regd)
P.B.No.10, MACHILIPATNAM-521 002 (A.P.)
INDIA

చమత్కారాలుగా కనిపిస్తాయి, వినిపిస్తాయి. అయితేవారు మాట్లాడే ప్రతిమాట వెనుక ఎంతో నిగూఢమైన అర్థం యిమిడిఉంటుంది. లోతుకుపోయి పరిశీలిస్తే, దానిలో నేర్చుకోవలసినది ఎంతో ఉంటుంది.

"ఈనాటి విద్యార్థులలో Purity (పవిత్రత) లేకుండా పోయింది. Unity (ఐకమత్యం) అంతకన్నాలేదు. Enemity (శతృత్వం) మాత్రం ప్రబలిపోతున్నది. ఈనాడు చాలా విద్యాలయాలలో Unity కోసం Unions ను ప్రారంభిస్తున్నామంటున్నారు. Union అంటే అందరూ కలిసిఉండటం. కాని యూనియన్లపేరుతో పోటీలుపడి చిన్నాభిన్నమైపోతూ Co- operation ను సాధించవలసిన విద్యార్థులు Operations చేస్తున్నారు." అని ఒక పర్యాయం చమత్కరించారు బాబా. ఈనాడు కళాశాలల్లో విద్యార్థి ఎన్నికలపేరిట జరుగుతున్న తతంగం ఇదే. విద్యార్థులలో నాయకత్వలక్షణాలను పెంపొందించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దీనిని ఎవరూ కాదనరు. ఐతే క్రమశిక్షణలేని నాయకత్వంవలన, సత్ప్రవర్తనలేని నాయకత్వం వలన ప్రయోజనంలేదంటారు బాబా.

"చదువు చదివి చదివి సద్గుణంబులులేక
పరులమోసగించి బ్రతుకువాడు
వానికంటెమేలు వసుధలో గాడిద
బరువుమోసి తాను బ్రతుకుచుండు"

అని చెప్పారు బాబా. ఈనాడు తెలివితేటలు వక్రించి పరులను ఏవిధంగా మోసగించాలా? అనే ఆలోచన చేస్తున్నారు. కర్తవ్యాన్ని విస్మరిస్తున్నారు, బాధ్యతలను గుర్తించడంలేదు. హక్కులకోసం మాత్రం పోరాడుతున్నారు. ఇది సరియైన విధానం కాదు. శ్రీ సత్యసాయిబాబావారు ఒక పర్యాయం 'డ' కార పంచకమును గురించి వివరించారు. అవి 1. Dedication (అర్పణ చేయుట) 2. Devotion (భక్తి) 3. Discipline (క్రమశిక్షణ) 4. Discrimination (విచారణ, విచక్షణ) 4. Determination (పట్టుదల). మొట్టమొదట అహంకార సమర్పణ చేయాలి. భక్తితో పరమాత్మను నిత్యమూ స్మరించాలి. క్రమశిక్షణను కఠినంగా పాటించాలి. విచారణా శక్తిని అభివృద్ధి పరచుకోవాలి, విచక్షణా జ్ఞానమును సంపాదించాలి. వివేకముతో వ్యవహరించాలి. ప్రగతి పథమును చేరుకోవాలంటే పట్టుదల ముఖ్యం. బాబా ప్రతిపాదించిన ఈ 'డ' కారపంచకం ప్రగతికి సోపానం. వీటిని విద్యార్థులేకాదు, ప్రతి ఒక్కరూ అనుసరించి, ఆచరించి, అనుభవంలోనికి తెచ్చుకోవాలి. అప్పుడే అర్హత లభిస్తుంది. మానవత్వస్థాయి నుండి ఒక మెట్టు పైకి ఎదగగలుగుతారు.

బాబా ప్రత్యేకంగా విద్యారంగంలో ఎనలేని కృషిని కొనసాగిస్తున్నారు. బాబా ఆధ్యాత్మిక దృక్పథమును అంగీకరించనివారు సహితం, వారు విద్యారంగంలో చేస్తున్న కృషిని అంగీకరించక తప్పదు. ఏ ప్రభుత్వాలు చేయలేని పనిని వారు ఈ రంగంలో చేస్తున్నారు. అదే వారి ప్రత్యేకత. ❑

## సుభాషితములు

"కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహో నాస్తి
నాస్తి జాగరతో భయమ్"

కృషి చేయుటవలన కఱువురాదు. జపము చేయుట వలన పాపంరాదు. మౌనము వలన కలహము రాదు. జాగ్రత వలన భయముండదు.

# అవతారవాణి - సుధాస్రవంతి

ఏనాడు ధర్మగ్లాని సంభవించునో, ఆ యుగములో నిరాకారుడు, నరాకారమును ధరించి ధర్మోద్ధరణ జరుపునని 'గీత' బోధ. కృత, ద్వాపర, త్రేతా యుగావతారులు ఆయా యుగములందున్న రాక్షస హింసల నుంచి సాధు సంరక్షణ జరిపి ధర్మ సంరక్షణ జరిపిరని రామాయణ, మహాభారతములు విశదీకరించినవి.

ప్రస్తుత కలియుగావతారిగా సమస్త మానవాళిచే ఆరాధింపబడుతున్న శ్రీ సత్యసాయిబాబా వారి అవతార కార్యక్రమ విధానములను సునిశితముగా పరిశీలించిన వారి, ప్రతిహృదయమునందు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ప్రేమస్వరూపునిగా, నడయాడే దైవముగా స్ఫురించబడు చున్నారన్న అతిశయోక్తి కాదు. విదేశీయులు సహితము స్వామిని Loving God/ Living God గా గుర్తించారంటే, ఇక భారతీయుల సంగతి వివరించనక్కరలేదు కదా!

త్రేతాయుగమునందవతరించిన శ్రీరాముడు, ద్వాపరయుగావతారి శ్రీకృష్ణుడు సమయానుకూలముగా, ఆయా సందర్భములయందు వారి దర్శనము అనివార్యమై నపుడు మాత్రమే, నిండుసభలో దర్శన భాగ్యము ప్రసాదించి, అతికొద్ది మందితో సంభాషించినట్లు మాత్రమే రామాయణ, భారత గాధలు తెలుపుచున్నవి. కాని వారు యావత్ జనావళికి ఎట్టి హామీ ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని, ఇచ్చిన దాఖలాలు లేదు. అది ఒక్క శ్రీసాయి భగవాన్ అవతారములోనే జరిగినదన్న కాదనగలవారలేరీ? అయితేఅంతటి హామీ ఎట్టిదో, ఏ వయసులో ఇచ్చిరో తెలుసుకొనవలసినది గదా!

బాబా తమ లేత్రాయములో అవతార ప్రకటన గావించి,మాతాపితరులకు తాను 'సాయిబాబా' నని, తనభక్తులు తమని పిలుస్తున్నారని, తమకు ఇటు పిమ్మట వారితో కుటుంబ సంబంధము లేదని తెలిపిన పిదప యావత్ మానవాళిని సంబోధిస్తూ చేసిన 'అభయ ప్రదాన శంఖారవము' ను ఒకపరి మరల జ్ఞప్తికి తేచ్చుకొని, మన విశ్వాసమును మరింత పదిలపరచుకొనెదము.

అడవిలోన నున్న ఆకాశమున నున్న
పట్టణమున నున్న పల్లెనున్న
గట్టుమీదనున్న నట్టేటనీవున్న
మరువడు నిను సాయి మదిలో నెపుడు

పై అభయ ప్రదానము సమస్త జీవకోటికి ఉద్దేశింపబడినదైనప్పటికి, ఎవరు ఆర్తితో సాయి అని పిలచెదరో, వారికే ఓయీ అనెడి సమాధానముతో సహాయ హస్త మందించబడునని గ్రహించనగును. లోకోక్తి ప్రకారము 'అమ్మ' ఐనాసరే గాని పిలవకుండా బిడ్డల ఆకలిని , ఆర్తిని దీర్చదన్నపుడు, ఆధ్యాత్మిక పిపాసనెడి ఆర్తిని అలవోకగా తీర్చుకొనుట సాధ్యమా?

## పి. యస్. వి. సుబ్రహ్మణ్యం

అయితే ఏ దేవాలయమునకైనా సంబంధిత దైవదర్శనము, చేయదలచి వెళ్ళినపుడు, దర్శన టిక్కెట్టు కొని, వరుసలో కొంత సమయము వేచి యుంటే గాని దైవదర్శన భాగ్యము లభించదని తెలియని వారుండరు. కాని శ్రీ సాయి దర్శన, స్పర్శన, సంభాషణలకు ఒక్క నామస్మరణ యనే ప్రవేశ రుసుము అభిలాష గలవారల్లు కట్టవలసి యున్నది. ఏమన అవి మూడును అమృతముకన్న విలువైన వగుటయేయని గ్రహించనగును. నామస్మరణయందు పాల్గొన్న వారలే పుట్టపర్తిలో, పర్తీశ్వరుని సమీపములో హాజరగుటకు సాయి సంకల్పించును. వారి సంకల్పములేక ఎంతటి కోటీశ్వరుడైనా, ఉన్నతాధికారి ఐనా, దేశప్రధాని గూడా పర్తిపురమునందడుగిడలేడు. "అర్హత పొంది, అడుగిడు" అన్నది శ్రీ సాయి శాసనము. Deserve Before you Desire. అది అనుల్లంఘనీయమని విశ్వసించవలసినదే! ఏమన

దర్శనమే దివ్య అమృతము
సంభాషణమే అమృతము
స్పర్శనమే దివ్య అమృతము
సాయి నామామృతమే అమృతము అనెడి కీర్తన యదార్థము గాదా!

తదుపరి మానవాళిని 'బాబా' కోరేది లౌకిక వస్తుజాలము కాదు. అమూల్యమైనది, అపురూపమైనది, అనిర్వచనీయమైనది, అంగడిలో కొనుటకు అలభ్యమైనది, పుట్టుకతోనే మానవాళికి భగవంతునిచే ప్రసాదించబడినది అగు ప్రేమ యనెడి మానసిక పూజా పుష్పమొక్కటియే యని గ్రహించాలి. అది ఒక్కటే మానవుని, మాధవుని చెంతకు చేర్చే అతి సులువగు దగ్గర మార్గమని శ్రీ సాయి బోధ తెలియని వారుండరు.

"దినచర్యను ప్రేమతో ప్రారంభించు,
ప్రేమతో నింపు, ప్రేమతో పరిసమాప్తి గావించు"

(Start the day with Love, Fill the day with Love and end the day with Love. Since the Love is God And God is Love, Live in Love, that is the way to God)

దైవాన్ని చేరే దగ్గర మార్గాన్ని, ఇంత సరళముగా, ఇంత వివరముగా, ఎట్టి ఆర్థిక సంబంధ పెట్టుబడి లేకనే ఇంతవరకు గడిచిన ఏ అవతారము విశ్లేషించినదో, ఏ పురాణగ్రంధము వివరించినదో, ఏ పీఠాధిపతి జనావళి కందించెనో చెప్పగల వారలెవ్వరు?

కనుకనే ఈ కలియుగావతారియగు బాబా సకల శాస్త్ర, పురాణ, ఇతిహాస, వేద, వేదాంత గ్రంధాల సారమును ఒకే ఒక్కసారి ఒక్కమాటలో చెప్పెదనని పూరించిన శంఖారావము వినని సాయి భక్తులు గలరా?

"సకల వేదాంత గ్రంధాలసారమెల్ల ఒక్కమాటలో చెప్పెద ఒక్కసారి,
సర్వజీవుల యందున్న ఆత్మ, నీవు ఒక్కటేయని తెలియరయ్య"

"అయమాత్మా బ్రహ్మ, అహంబ్రహ్మోస్మి, ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనెడి వేదాంత పదముల సారాంశమును తేట తెల్లముగా, అరటిపండొలిచి నోటికందించెడి తీరున 'మమాత్మా, సర్వభూతాంతరాత్మ' యని సులభంగా పామరుడు సైతము గ్రహించునంతటి విధానమున ఒక్కస్వామికే తక్క వేరొకరికి సాధ్యము కాదనుట నిర్వివాదాంశము! హృదయం ప్రేమమయమైతే లోకమంతా బ్రహ్మమయమని ఒకే ఒక్కవాక్యములోని శ్రీసాయి బోధ, 700 శ్లోకముల గీతాసారము గాదా?

దైవానికి రూపంలేదు, గుణంలేదు, నిర్ణీత స్థలము, సమయము లేదు. అట్టిదైవము కేవలం ప్రేమలోనే యున్నాడని', ఆ ప్రేమయే దైవమని, అదియే ఆత్మయని శ్రీ సాయి ప్రబోధను గమనించండి.

"దేవుడెక్కడనుచు దేవులాడగనేల?
హృదయమందు లేడె ఈశ్వరుండు
ఇచ్చుకొనుము సేవ, పుచ్చుకొనుము ప్రేమ,
అటుల చేసి, ఆత్మతత్వ మనుభవించు"

ప్రేమను దేనితోను సరిచూడలేము, పోల్చలేము, కలుపలేము, అది ఒక్క ప్రేమతోనే సంధింపబడునన్న సాయి పలుకుల సారమును ఒక్కపరి చవిచూచెదముగాక.

ప్రేమరూపము బ్రహ్మంబు, ప్రేమ మయము,
ప్రేమను ప్రేమతో సంధింప నీమమగును,
కాన ప్రేమను పూర్తిగా కలిగి యున్న
అద్వితీయము చెందంగ అర్హుడగును

అన్న బోధయందలి సత్యమును గ్రహిస్తే స్వామి సాక్షాత్తు మూర్తీభవించిన ప్రేమ స్వరూపమని గ్రహించగలము. ఆ సత్యమును శ్రీ సత్యసాయియే స్వయముగా ప్రకటించి రన్న కాదనగలవారలెవ్వరు?

ప్రేమమూర్తి యతడు, ప్రేమించు మాతని,
ప్రేమకతడు, మారుపేరు (గాదె ?) యగును
ప్రేమలేక బ్రతుకు పామరుండగువాడె
సత్యసాయి తెల్పు సత్యమిదియె

ఏతావాతా త్రేతయుగావతారి శ్రీరాముడు మూర్తీభవించిన సత్యస్వరూపుడైతే, ద్వాపరయుగావతారి శ్రీకృష్ణుడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడన్న, ఈ కలియుగావతారి శ్రీ సత్యసాయిబాబా మూర్తీభవించిన ప్రేమస్వరూపుడని విశ్వసించి, అర్చించి, ఆరాధించి, ఆనందించుటే నేటి మానవాళి కర్తవ్యము, ముక్తి మార్గము.

* * *

# భగవాన్ సాయి అనంతమైన మహిమలు

వసంత ఋతువు. ఒక రోజున అనుకోకుండా స్వామి మాకు మరొక ఇంటర్వ్యూ ఇచ్చి అనుగ్రహించారు.

మేమందరం, స్వామి సింహాసనమునకు కుడివైపు మగవాళ్ళం, ఎడమవైపు ఆడవాళ్ళు చుట్టూ చేరాము. మొట్టమొదటగా స్వామి తన దివ్య హస్తమును పైకెత్తి ఒక్క క్షణంలో దివ్య సుగంధ పరిమళభరితమైన విభూతిని ఎక్కువ మొత్తంలో సృష్టించి అక్కడ కూర్చున్న ఆడవారికి పంచారు. ఆ బృందములో ఒకాయన ఆరోగ్యమును గురించి ప్రశ్నించి తెలుసుకుని ఒక నేత్ర లింగమును సృష్టించి ఆయనకిస్తూ, ప్రతిరోజూ దానికి అభిషేకము చేసి ఆ నీటిని త్రాగుమని, అలాచేస్తే ఆయన ఆరోగ్యము బాగుపడుతుందని సెలవిచ్చారు.

తరువాత, బంగారు లాకెట్టుతోనున్న ఒక హారమును, స్వామి జన్మించిన సంవత్సరమగు 1926వ సంవత్సరములో ముద్రింపబడిన ఒక బంగారు నాణెమును సృష్టించి, అక్కడ కూర్చున్న ఒక పెండ్లికుమార్తెకు బహూకరించారు.

మరొక వ్యక్తికి ఒక జపమాలను, రక్షణకొరకు ఒక వెండి లాకెట్టును సృష్టించి యిచ్చారు.

ధగధగా మెరిసిపోయే ఈ వస్తువులను ఆయా వ్యక్తులకు బహూకరిస్తూ నీటిలో చేపవలె, చెట్టుకు కొమ్మ వలె, సముద్రములో కలిసిపోయే నదివలె జీవాత్మ పరమాత్మతో ఐక్యము చెందినప్పుడే జీవితానికి సాఫల్యము ఉంటుందని చెప్పారు.

మానవుడు అద్వైత తత్త్వమును తన ఆలోచనా విధానముగా మార్చుకుని, అందులో లీనమై, నిత్యజీవితంలో క్రమశిక్షణతో కర్మలు ఆచరించాలని స్వామి సలహా యిచ్చారు.

అహంకారరహితమై, కర్మఫలమును ఆశించకుండా నెరవేర్చిన కర్మలు, అకర్మలుగా రూపొందుతాయని ఆయన చెప్పారు; ఎందుచేతనంటే, అట్టి కర్మలు భవిష్యత్తులో బంధనాలకు, పునర్జన్మలకు, 'విత్తనములు'గా ఉపయోగపడే సూక్ష్మమైన వాసనలను ఉత్పత్తి చేయవు.

"ఆధునికుల"మని చెప్పుకునే నేటి కొందరు వ్యక్తులు కర్మ, పునర్జన్మ, దివ్యావతారములు - వీటికి సంబంధించిన సిద్ధాంతములను నమ్మరని స్వామి చెప్పారు. అటువంటి ఆధునికులు తమ అంతరాత్మను ప్రస్తుతం తాము ధరించిన శరీరమునకు పరిమితం చేసే సిద్ధాంతమునకు కట్టుబడి ఉంటారు. అయితే, మన ప్రాచీన వైదిక సంస్కృతి ననుసరించి, సనాతనమైన దివ్యాత్మ అశాశ్వతమైన, నశించిపోయే తత్త్వముగల శరీరము నందు అధివసించియుంటుంది.

## శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావు

గోపికలకు శ్రీ కృష్ణపరమాత్మతో గల సంబంధమును పాశ్చాత్యులు పూర్తిగా అపార్థము చేసుకున్నారని స్వామి చెప్పారు. శ్రీకృష్ణుని కంటె వయస్సులో పెద్దవారైన గోపికలు ఆటపాటలతో, పరిహాసాలతో, అల్లరిచిల్లరిగా చిలిపి చేష్టలు చేస్తూ అప్పుడప్పుడు అద్భుతమైన లీలలను ప్రదర్శిస్తున్న లీలామానుష వేషధారియైన బాలకృష్ణుని చూచి పూర్తిగా సమ్మోహితులయ్యారు. అందువలన, ఆయనను గోపికల హృదయములనే నవనీతమును దొంగిలించే నవనీత చోరుడన్నారు. గోపికలకు, శ్రీకృష్ణునికి మధ్య ఎట్టి శారీరక సంబంధమనే ప్రశ్నే లేదు. వారి మధ్యనున్నది, పవిత్రమైన ఆధ్యాత్మిక సంబంధము. అవతార పురుషుల లీలలను అర్థము చేసుకొని అందులోని తత్త్వమును గ్రహించడానికి పవిత్రమైన, ఉన్నతమైన మనస్సు కావాలి.

అదే విధముగా, కైలాసములో పరమేశ్వరుడు, శక్తి స్వరూపిణియైన పార్వతితో కలిసి చేసే తాండవ నృత్యములో ప్రకృతి, పరమాత్మల కలయిక అనే సూక్ష్మ తత్త్వము ఇమిడియున్నది. అటువంటి సూక్ష్మమైన విషయాలు వివేకముతో కూడిన విజ్ఞానము వలన, అంతర్వాణి ప్రబోధముతో పొందిన ఆధ్యాత్మిక

అనుభవముల వలన మాత్రమే అర్థము చేసుకోవడానికి వీలవుతున్నది. అంతేకాని, పచ్చకామెర్లు సోకిన కామం కప్పిన కళ్ళతో, పూర్తిగా ప్రాపంచికమైన, శరీరమే పరమావధిగా భావించే మిడిమిడి జ్ఞానంతో గ్రహించడానికి వీలుపడదు. భగవంతుని దివ్యతత్త్వమును పవిత్రమైన, నిర్మలమైన భక్తిద్వారా మాత్రమే దర్శించి, అనుభవించడానికి వీలుపడుతుందని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లు ఈ సందర్భముగా స్వామి గుర్తు చేశారు.

ఆ తరువాత స్వామి మమ్మల్ని ఆంతరంగిక సంభాషణ జరిపే లోపలి గదిలోనికి తీసుకొని వెళ్ళి మా జీవితములోని అతి స్వల్ప సంఘటనలను, సమస్యలను ఎత్తి చూపిస్తూ వాటిని ఏవిధంగా పరిష్కరించుకోవాలో తెలియజెపుతూ స్పష్టమైన సలహాలు, సూచనలు ఇచ్చారు. నిజంగా ఇది స్వామి మాకు ప్రసాదించిన, మా ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేసే ఒక అద్భుతమైన ఇంటర్వ్యూ.

## ...త్యయం

తిరుగులేనిది నీ ఆనతి
జరిగేదీ జరుగనున్నదీ
అంతా నీ ఆజ్ఞకు బద్ధం
ఇదేమని అదేమని ప్రశ్నకు
లేదు వితర్కానికి ఆస్కారం !
ఏదో ఒక సమయంలో సృష్టిక్షణంలో
నీవు మలచిన మట్టిముద్దను
మహత్త్వపూర్ణం నీ నిర్ణయం
దయా ప్రపూర్ణం నీ శాసనం
అంతులేనిది నీ కారుణ్యధార
మట్టిని మనిషిని చేసే జీవధార !
శిరస్సు వంచి గ్రహిస్తున్నాను
నీ ధర్మ శాసనాన్ని! నీ సర్వజ్ఞత్వాన్ని!

**- సి. వేదవతి**

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri Gudla Vaikuntam**
**Smt. G. Vijayalakshmi**
Jaipur, Orissa



**Sri Narumanchi Satyanarayana**
**Smt. N. Adi Seshamma**
Hyderabad



**Sri Kondapalli Hanumantha Rao**
**Smt. K. Sarojini Devi**
Khammam



**Smt. & Sri**
**Padmanabham Cherukuri,**
Michigan. U.S.A.

## మంచి అవకాశము

87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి
## రియల్ ఎస్టేట్స్
### పుట్టపర్తి

మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.**

క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు
నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"

ఇట్లు
శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్
**ప్రొ|| పి. సిద్దయ్య శెట్టి**
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి

(సెకండ్ కవర్ తరువాయి)

స్వాగత గీతం కర్ణపేయంగా ఆలపించి సభా సదులను రంజింపచేశారు. అటుపై 'నవ్యకవి' శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి కార్యక్రమానికి ప్రయోక్తగా వ్యవహరించి కార్యక్రమాన్ని ఆసక్తిదాయకంగా ఉండేలా మలిచారు.

సేవా కార్యక్రమాల దగ్గర నుండి ప్రతి కార్యక్రమంలోనూ ఎంతో కొంత స్వార్థం లేదా స్వలాభాపేక్ష ఉండటం మనం గమనించని విషయం కాదు. కాని విశేషంగా చెప్పుకోవల్సిన విషయం ఏమిటంటే ఏ రకమైన ప్రయోజనాన్ని ఆశించకుండా, కేవలం ఒక తెలుగువాడిని, అందునా బందరు పట్టణంలో విద్యను అభ్యసించి నేడు భారతదేశంలోని ఒక అత్యున్నత స్థానానికి చేరుకున్న ఒక గొప్ప న్యాయశాస్త్ర కోవిదుడ్ని, మేధావిని గౌరవించు కోవాలన్న సత్సంకల్పంతో ఈ కార్యక్రమాన్ని శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి నిర్వహించారంటే అది అతిశయోక్తి కాదు. అందుకే ఈ కార్యక్రమానికి అపూర్వ స్పందన లభించింది.

శ్రీ అంబటి బ్రాహ్మణయ్య జ్యోతి ప్రజ్వలన చేశాక అధ్యక్షులు శ్రీ కొమరగిరి తొలి పలుకులతో కార్యక్రమం ముందుకు సాగింది. శ్రీ జి.వి.జి. వంటి ఒక మహా మేధావిని, కొన్ని ఉత్తమ విలువలకు, సిద్ధాంతాలకు కట్టుబడిన న్యాయశాస్త్ర కోవిదుణ్ణి, సన్మానించుకునే అవకాశం తమకు కల్గినందుకు, అందుకు శ్రీ పిరాట్ల చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలుపుతూ, శ్రీ కొమరగిరి తమ ఆనందాన్ని ప్రకటించారు.

ఆ తర్వాత ఆదిశంకరాచార్య జన్మదిన సంచికను శ్రీ జి.వి.జి. ఆవిష్కరించారు. దాదాపు డెబ్భైకి పైగా స్థానిక సేవా సంస్థలు, సాహితీ సంస్థలు శ్రీ జి.వి.జి.ని సన్మానించేందుకు ముందుకు వచ్చాయి. స్థానిక హిందూ కళాశాల రీడర్ డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు, శ్రీ జి.వి.జి.ని తొలుత సభకు పరిచయం చేస్తూ బాల్యం నుండే వారు ఎలా ఎన్నెన్ని సేవా కార్యక్రమాలు నిర్వహించారో, ఎన్నెన్ని పదవులను అలంకరించారో వివరించారు. ఆపైన ముందుగా హిందూ కళాశాల తదితర అనుబంధ సంస్థల పాలకవర్గ అధ్యక్షులు డా॥ ధన్వంతరి ఆచార్య దంపతులు శ్రీ జి.వి.జి. దంపతులను చందన తాంబూలములతోనూ ఫల పుష్పములతోనూ, నూతన వస్త్రములతోనూ సన్మానించారు. తర్వాత శ్రీ కొమరగిరి దంపతులు, వారి కుటుంబసభ్యులు శ్రీ జి.వి.జి. దంపతులను సన్మానించారు. ఆ తర్వాత పోలవరంలోని శ్యాంప్రసాద్ వీవర్స్ సొసైటీ వారు జి.వి.జి. దంపతులను సన్మానించారు. అటుపై ఆంధ్ర సారస్వత సమితి, సాహితీ మిత్రులు, కళాసాగర్, వాణిజ్యమండలి, రైస్‌మిల్లర్స్ అసోసియేషన్, కవిప్రభా, రాష్ట్ర అర్చక సేవా సమితి, విశ్వహిందూ పరిషత్, ఎల్.ఐ.సి. ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్, ఇండియన్ కల్చరల్ అసోసియేషన్, వైస్ మెన్ క్లబ్, బందరు రంగ స్థల కళాకారుల సంఘం, యాదవ సంఘం, రోటరీ క్లబ్ మొదలైన విభిన్న సేవా సంస్థలు జి.వి.జి. దంపతులను సన్మానించారు. సన్మాన కార్యక్రమం శ్రీ యల్.యస్. శాస్త్రి ఆధ్వర్యంలో కన్నుల పండువగా జరిగింది. సన్మానం ఒక ప్రక్క జరుగుతుండగా మంగళ వాయిద్యాల నడుమ శ్రీ కొమరగిరి తృతీయ కుమారుడు చి॥ శ్యామ్ ప్రసాద్ 'శ్రీవాణి' తరుపున జి.వి.జి. కి సన్మాన పత్రాన్ని సమర్పించారు.

సన్మాన కార్యక్రమం ముగిశాక శ్రీ అంబటి బ్రాహ్మణయ్య ప్రసంగిస్తూ, ఎన్నికలలో గెలిచిన ప్రతి వ్యక్తీ సమాజానికి జవాబు చెప్పవల్సిన బాధ్యత కల్గి ఉంటాడనీ, టి.వి.ల ద్వారా, పేపర్ల ద్వారా ప్రజలు ప్రజాప్రతినిధి ఎక్కడ ఎలా ప్రవర్తిస్తున్నాడనేది అనుక్షణం గమనిస్తుంటారనీ, అందువల్ల ప్రజాస్వామ్యం నేడు చాలా శక్తివంతంగా భారతదేశంలో మనుగడ సాగిస్తున్నదనీ చెప్పారు. మాజీ ప్రసార సమాచార శాఖమంత్రి కాంగ్రెసు నాయకుడు శ్రీ పేర్ని కృష్ణమూర్తి మాట్లాడుతూ తాను కేవలం తనకు 'లా' చదువు చెప్పిన గురువుగారు శ్రీ జి.వి.జి.కి సభా ముఖంగా అంజలి ఘటించటానికి వచ్చానని చెప్పారు. రాజకీయాలలో నైతిక విలువలకు ఎలా తిలోదకాలి స్తుంటారో అందుకు నాయకులు ఎలా ప్రతిఫలాన్ని చెల్లించవల్సి ఉంటుందో ఆయన సోదాహరణంగా చెప్పారు.

రాజ్యసభ మాజీసభ్యులు శ్రీ కాశీనాధుని పూర్ణ మల్లికార్జునుడు ప్రసంగిస్తూ ప్రస్తుత రాజకీయ పరిస్థితి చాలా కలుషితమై పోయిందనీ, విష సంస్కృతి ప్రబలంగా కన్పిస్తోందనీ, రాబోయే కాలంలో రాజకీయాలు ఏ వికృత

రూపాన్ని దాలుస్తాయో చెప్పలేమని అన్నారు. తాను హిందూ కళాశాల పాలకవర్గ అధ్యక్షునిగా దాదాపు మూడు దశాబ్దాలుగా సేవ చేశానని, ఆ కళాశాలలోనే శ్రీ జి.వి.జి. విద్యాభ్యాసం చేయటం తనకు ఎంతో ఆనందదాయకం గానూ, గర్వకారణంగానూ ఉందనీ అన్నారు.

తర్వాత ముఖ్య అతిథి శ్రీ జి.వి.జి. కృష్ణమూర్తి "ప్రజాస్వామ్యం - ఎన్నికల సంస్కరణ" అన్న విషయంపై దాదావు గంటసేపు ఎక్కువ భాగం ఆంగ్లంలో ప్రసంగించారు. శ్రోతలు ఎవ్వరూ తమ స్థానాలనుండి కదలకుండా ఎంతో ఆసక్తితో వారి ప్రసంగాన్ని వింటూ మధ్య మధ్య ఆనందాతి రేకంతో కరతాళధ్వనులు చేస్తూ కార్యక్రమం చివరదాకా ఉండి జయప్రదం చేయటం విశేషం. శ్రీ జి.వి.జి. తన సుదీర్ఘ ప్రసంగంలో ఎన్నో ఆసక్తిదాయకమైన అంశాలను స్పృశించారు. అనేక విషయాలపై తమ అభిప్రాయాన్ని నిర్మోహమాటంగా ఉద్వేగంతో వ్యక్తీకరించారు. రాబర్ట్‌సన్ స్క్వేర్‌లో ఇద్దరు తగాదా పడి ఒకరి తల మరొకరు పగల గొడితే అది పెద్ద కేసు అవుతున్నది. అసెంబ్లీలో మైకులు విరగదీసి ఒక ప్రజాప్రతినిధి మరొక ప్రజాప్రతినిధిని తీవ్రంగా గాయపరిస్తే దానికి ఏ శిక్షా లేదు. అది చట్టం పరిధిలోకి రాదు. ఇది న్యాయమా అన్నారు శ్రీ జి.వి.జి. అలాగే ఒక పిక్‌పాకెటింగ్ చేసే తక్కువ స్థాయి దొంగను చట్టం కఠినంగా శిక్షిస్తున్నది. కానీ కోట్ల కొలది రూపాయలు స్కాముల్లో పీకల్లోతు కూరుకుపోయినా చూడనట్లు ఉంటున్నది. ఇదెక్కడి న్యాయం అని ప్రశ్నించారు.

పత్రికలు జాతికి చేస్తున్న సేవను ఆయన కొనియాడారు. పత్రికలు చాలా "పవర్ ఫుల్ మీడియా" అనీ, అది ప్రభుత్వాలను సహితం మార్చగలదని ఆయన అన్నారు. భారతదేశంలో ప్రజాస్వామ్యం అద్భుతరీగా ఉన్నదనీ, చిన్న చిన్న లోపాలు ఉండటం సహజమనీ, వాటిని మనం సరిదిద్దుకోవచ్చుననీ ఆయన అన్నారు. రాజ్యాంగంలో కొన్ని సవరణలు చేయవల్సిన అవసరం ఉందనీ, అదేమీ తప్పుకాదనీ ఆయన అన్నారు. నియోజక వర్గాలను గుర్తించటంలో భారతరాజ్యాంగం ఒకనాడు పాటించిన ప్రమాణాలు నేటి కాలానికి పనికిరావని ఆయన అన్నారు. దానికి ఆయన ఎన్నో ఉదాహరణలను కూడా ఇచ్చారు. పత్రికా నిర్వహణ కత్తిమీద సాము వంటిదనీ, గతంలో "ప్రజాప్రభ" పత్రిక డైరక్టరుగా తనకు ఈ విషయంలో తగినంత అనుభవం ఉన్నదనీ, అటువంటి పరిస్థితుల్లో న్యూస్‌ప్రింట్ కోరకుండా, ప్రకటనల జోలికి వెళ్ళకుండా, శ్రీవాణి వంటి ఒక సాంస్కృతిక ఆధ్యాత్మిక మాసపత్రికను నడపటం శ్రీ కొమరగిరికే చెల్లిందని ఆయన ప్రశంసించారు. బందరులో తను చదువుకున్న నాటి రోజుల్లోని కొన్ని అనుభవాలను ఆయన ఈ సందర్భంగా జ్ఞప్తికి తెచ్చుకున్నారు.

ఆ తర్వాత డాక్టర్ బి. సారంగపాణి వందన సమర్పణతో కార్యక్రమము ముగిసింది. కార్యక్రమంలో ఎక్కడా విసుగు అన్పించకుండా మధ్య మధ్య చక్కని వాయిద్య సహకారంతో ముగ్గురు గాయనీమణులు ఆలపించిన గీతాలు మనసుకు ఆహ్లాదాన్ని కల్గించాయి. కార్యక్రమం ఆసాంతం హృద్యంగా సాగి మచిలీపట్టణ పురప్రజలకు ఒక మరువలేని మధురానుభూతిగా మిగిలి పోయింది. శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు ఇందుకుగాను ఎంతో అభినందనీయులు. ●

*పాడిపంటలందు బహుముఖ నదులందు*
*గనులయందు అగ్రగామియైన*
*భరతమాత నీది భారతీయుడవీవు*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ*

*చిన్ని పిలక తాత చిన్న - పెద్దకు తాత*
*బోసి నవ్వు తాత పూజ్యదాత*
*భరతజాతి నేత 'బాపూజీ' తాతరా*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ*

*శాంత భూషితుండు సద్గురు దేవుండు*
*సత్యసుగుణ వెల్లి 'సర్వేపల్లి'*
*భరతజాతి మెచ్చు 'భారతరత్నంబు'*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ*

*భావిపౌరులైన బాలబాలికలన్న*
*'నెహ్రూ' పండితునకు నెనరుసుమ్మ*
*భరతమాతకతడు 'బంగరు పుత్రుండు'*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ*

**- ఏకా రామచంద్రరావు**

# భగవాన్ శ్రీ సత్యసాయి మహిమా విభూతి

**మనం కన్నులుండి కానలేని అంధులము**

**చెవులుండీ వినలేని బధిరులము**

శ్రీ సత్యసాయి మహిమానుభూతులు ప్రపంచ మంతా ఎన్ని జరుగుతున్నాయో చెప్పలేము. ఆ భగవానుని దివ్యలీలలు అనంతం. ఒక్కో భక్తుడు ఏవో కొన్ని మహిమలను యేరి ఒక గ్రంథము వ్రాసి గ్రంథకర్త అయిపోతున్నాడు. ఎక్కడో జరిగినవి చదివి, విని ఆశ్చర్య పోతుంటాము. కాని ఒక్కొక్క భక్తుణ్ణి కదిలిస్తే ఎన్ని దివ్యమహిమలు వల్లిస్తాడో చెప్పలేము. సరళాజోషి "కలియుగ తీర్థక్షేత్ర" అలాంటి అనుభవాలను స్వయంగా చూచి, విచారించి వ్రాసిన గ్రంథం. అందులో ఎందరు భక్తుల అనుభవాలో ఉన్నాయి. చూచి తరించవలసిన కలియుగ తీర్థక్షేత్రం మన రాష్ట్రంలో ఒకటుంది. అదే వేటపాలెంలోని శ్రీ సాంబశివ రావుగారి యిల్లు. వేటపాలెం భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సమితి ఆహ్వానం మీద మేము వేటపాలెం వెళ్ళడం తటస్థించింది. నెల్లూరు శ్రీ సత్యసాయి సేవా సమితి పక్షాన 26మంది భక్తులం ది. 13-12-97న వేటపాలెం వెళ్ళాము. అక్కడ ఆ రాత్రి గం॥ 9-00 ల నుండి మరురోజు ఉదయం గం॥ 4-30 ని॥ల వరకు అఖండ భజన జరిగింది. అందులో మేమంతా పాల్గొన్నాము. ఉదయం గం॥ 4-30 ని॥ నుండి గం॥ 5-30 ని॥ వరకు నగర సంకీర్తన ఎంతో వైభవంగా జరిగింది.

ఆ కార్యక్రమంలో భాగంగా బాపట్ల కళాశాల క్చరరు శ్రీ భరద్వాజగారు ఒక గంటసేపు భగవాన్ శ్రీ త్యసాయి దివ్య సందేశాన్ని గూర్చి ప్రవచనం చేశారు. అక్కడ ఒక పేద భక్తుడు శ్రీ సాంబశివరావు. వారి ఇంటిలో విశ్రాంతంగా ఎన్నో రోజుల నుండి మహిమా విభూతులు రుగుతున్నాయి. కర్ణాకర్ణిగా వింటున్నదే గాని చూచింది దు. ఆరోజు మాకు కనులారా గాంచే భాగ్యం కలిగింది.

వారి ఇంటిలో ఒక చిన్న పూజాగృహముంది. నిలో భగవాన్ శ్రీ సత్యసాయి, శ్రీ షిర్డీసాయి చిత్ర పటాలు, దుకలు, విఘ్నేశ్వరుణ్ణి విగ్రహము ఉన్నాయి. భక్తి పత్తులతో ఉదయ సంధ్యల్లో నిత్యమూ పూజ చేస్తారు. గవాన్ బాబాగారి ఫోటో నిండా, ముఖం తప్ప అంతా విభూతితో దినమూ నిండిపోతుంది. కొన్ని పటముల మీద ఓం [illegible] క్రైస్తవుల మత చిహ్నమైన క్రాసు ఆకారముతో విభూతి అలముకుంటుంది. మేము అక్కడకు వెళ్ళిన రోజు దత్తాత్రేయ జయంతి. ఆ రోజు శ్రీ దత్తాత్రేయ ఆకారంతో విభూతి పరుచుకుంది. మేము ఆ గదిలో స్వామి సన్నిధిలో మధ్యాహ్నం గం॥ 12-00 లకు ఒక కప్పులో నైవేద్యము పెట్టి, పళ్లెంతో మూసినాము. తర్వాత భక్తి శ్రద్ధలతో 45 నిముషములు భజన చేసినాము. మా 26 మంది భక్తులము 16 రంగు రంగుల జాకెట్ పీసులు, రంగురంగుల చీరెలు, పది, పరచిపెట్టి, స్వామికి హారతిచ్చి, గదినుండి బయటకు వచ్చి గడియ వేశాము. ఆ తర్వాత గదిలోకి ఎవరమూ వెళ్ళలేదు. 14వ తేది ఉదయం అఖండ భజన అయిన తర్వాత ఆ గది తలుపులు తీసి చూడగా ప్రతి గుడ్డపైన భగవాన్ బాబాగారి దివ్యచరణాలు విభూతితో ముద్ర వేసినట్లుగా, అన్నిటిపై ఒకే సైజులో ఏర్పడ్డాయి. మా పూర్వజన్మ సుకృతము వలన, మా కనులారా స్వామివారి దివ్యలీలను దర్శించగలిగాము. భగవాన్ పాదములకు ప్రణమిల్లి, ఎవరి వస్త్రాలు వారు తీసుకొని నెల్లూరు వచ్చాము. కొన్ని వస్త్రాలను నెల్లూరు సదన్‌లో పెట్టగా అందరూ దర్శించి ఆనందించారు. మూతపెట్టిన ప్రసాదాన్ని ఆరోజు తెరచి చూడగా ఎవరో వేళ్లతో తీసుకున్నట్లు గుంతలుపడి ఉన్నది. భగవాన్ స్వయంగా, స్వహస్తాలతో స్వీకరించి మమ్మల్ని ధన్యులను చేశారు.

అంతేకాదు. అప్పుడప్పుడు అక్కడ భగవాన్ పటము నుండి అమృతము స్రవిస్తుందట. అక్కడొక వింత అలవాటుంది. చంటి పిల్లలకు అన్నప్రాసన చేయాలని, భగవాన్ పటాల గదిలోకి తెచ్చి పిల్లవాణ్ణి పడుకోబెట్టి, ప్రసాదం స్వామి పాదాల వద్ద ఉంచి, తలుపు వేస్తారట. పిల్లవాని ఏడుపు విని తలుపు తీస్తే, ప్రసాదం పిల్లవాని మూతికి అయి ఉంటుందట. భగవాన్ బాబాయే ఆ పసిపాపలకు అన్నప్రాసన చేస్తారట. ఇలాంటి అద్భుతాలెన్నో అక్కడ నిత్యమూ జరుగుతున్నాయి. మా కనులతో మేము వస్త్రాలపై భగవానుని పాదముద్రలు, ప్రసాదంపై వేళ్ల గుర్తులు చూడగలిగాము. కలియుగదైవమా! ఈ లీలలన్నీ నీపై నమ్మకాన్ని గాఢతరం చేసుకొనేందుకే కదా! మరి అంతలోకే మాయ కప్పేస్తుందా! మా భారాలన్నీ నీపై వేసి నిశ్చింతగా ఉండలేకపోతున్నామే. ఏమిటి స్వామీ! ఈ వింత? ●

- ఆర్. ధనసింగ్



# శ్రీ శివసాయి అకామిడేషన్

మొదటి రెండవ అంతస్తులో, కుమార్ విలాస్ హోటల్‌కాంప్లెక్సు పైన,

గోపురం ప్రక్కన, **పుట్టపర్తి - 515 134**

*ప్రశాంతి నిలయం S.S. హాస్పిటల్, M.R.O. ఆఫీస్,*
*గోకులం దగ్గరలో గల ప్లాట్స్, అపార్టుమెంట్స్, ఫారం లాండ్స్ అమ్మకము*
*మరియు కొనుగోలుకు సంప్రదించండి.*

ఒక్కసారి రూ. 10,116/- లు చెల్లించిన 10 సంవత్సరముల వరకు ప్రతి సంవత్సరమునకు 60 రోజుల వంతున డోర్ నెం. 324, కుమార్ విలాస్ పై రెండు అంతస్తులు, గోపురంగేటు ప్రక్కన, గోపురంరోడ్ వద్ద ఉచిత వసత సౌకర్యము లభించగలదు.



**శివసాయి అకామిడేషన్స్ ప్రారంభించబడినది.**

**వాయిదా పద్ధతిలో ప్లాట్లు మరియు అపార్ట్‌మెంట్లు కూడా లభించును.**

ప్రొప్రయిటర్స్ :

గ్రంధి యుగంధర్, చుండూరి వెంకటేశ్వరరావు B.A